ఓం.

'అసతో మా స ద్గమయ
తమసో మా జ్యోతి ర్గమయ
మృత్యో ర్మా అమృతం గమయ

బృ హ దా ర ణ్య...

ఓం.

# స్వామి రామతీర్థ సందేశం

*

శ్రీ శ్రీ పరమహంస రామతీర్థస్వామి ప్రాచ్యపాశ్చాత్య
ఖండాల్లో ఇచ్చిన సంపూర్ణ ఉపన్యాస సంపుటాల్లోని
మహోత్తమ ప్రబోధాలు.

*

సంపాదకుడు
కేశవతీర్థులు

*Price* 1 *Re.*] 4అ. 

చిరునామా :

డి. కేశవరావు

శ్రీరామతీర్థ సేవాశ్రమం

కేంద్రం :

జానపాడు-పిడుగురాల (Po.)

గుంటూరు జిల్లా.

శాఖ :

నరసరావుపేట-గుంటూరుజిల్లా.



— బెజవాడ —

ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

అ. వేంకటరత్నం, M. Sc. గారిచే

— ముద్రింపబడియె, 1944. —

OM

# INTRODUCTION.

**(By Sree Sree Tirdhapada S. SANTI PRAKASHGI, President of Sree Rama Tirtha Publication League, Lucknow.)**

Blessed are they, who study the Works of Swami Rama, and doubly blessed are they, who realize his teachings and bring them into action. Thrice blessed are they, who try to make others study and realize these soul inspiring teachings, that make home in every sincere heart, that is free from prejudices of all sorts. Why do these teachings attract people from almost all the quarters of the world? It is because they come from him, who was the same in all his thoughts, words and actions, and has "emancipated human mind from centuries of mental slavery"; nay, because he has saw divinity in each and all. "Though he was born in India, yet he was an American as well as a Japani and a Persian to the people of those countries, nay, he was something more than this. The Americans saw the living Christ in him and the Japanese waved the

light before him in their temple of Lord Budha. The. Muhammadans listened to him from the pulpit in the mosque of Cairo at Egypt in Africa.

Men of different shades and thoughts find food for them in his teachings, digesting which, they go on proceeding onward till they reach the goal of humanity. The secret of his success is that he never tried to teach what he himself did not master full well. Hence he asks us not to be a slave of an authority, which serves us as an aid. What-so-ever he spoke, came from his heart and found place in those of others, as the things that come from the heart go to the heart. Even those who did not agree with his philosophy could not refrain from loving him on account of sincerity and purity of his heart.

He would tell us to "Feel, feel all the time that the power Supreme that manifests itself in the sun and the star the same the same I am, the same, the same is yourself. Take up the real Self, this glory of thine.............. ... Meditate on this your real beauty. ............Keep yourself thoroughly collected above the body or little self."

To him, Vedanta was not an intellectual philosophy, but it was the Practical religion that is unversal. He called it the Practical Vedanta or Common Path, that is constituted of.

Pushing March Labour and no stagnant indolence.

Enjoyment of work as against tedious drudger.

Peace of mind and no canker of suspicion.

Organization and no disaggregation.

Appropriate reform and no conservative customs.

Solid real feelings and no flowery talk.

Poetry of fact, as against speculative fiction.

The Logic of events as against the authority of the departed authors and

The living realization and no mere dead quotations"

The writer is glad to note that every part of our mother country is doing its best to popularise our national hero. Dear Rama in the form of Brother Kesava Rao of Rama Tirtha sewasram has volunteered himself to render

his service to the Telugu-speaking people by translating into their language, the soul-inspiring teachings of Swami Rama. May his efforts be crowned with success, and may other sincere souls of other parts of the country follow him in this respect, is the earnest prayer of the writer. Almost all his teachings have been translated into Hindi, that is the **Lingua Franca** of India. Some of them have been translated into Urdu and Gujrati as well. In order to translate the ideas of Rama, we should first embibe them, saturate ourselves with them, and then let the spiritual currents flow from us all around to purify and save all. We shall then become Saviours or **Tirthas**.

Yea at this critical moment, when the whole world is being ruined, nothing but these **Tirthas** can save humanity. Those who are thus saved echoe with our hero Rama Tirtha that "All the kings of the world or the chess-men of my chess-board, hence all the modes of peace and war are the ways of my enjoy-ments."

"Badshah dunya ke hain mohre meri sha-tranj ke,
Dillagi ke chal hain sab rang sulho jang ke."

౧౦

# రాముడు!



ప్రాపంచిక బంధాల్ని తెంపేసి విముక్తి మార్గాన్ని చూపించిన అఖండజ్యోతి-స్వామి రామ తీర్థుల జీవితాదర్శం - లోక వాంఛాతీతుడై, నిర్మలమైన ఝుంఝూ మారుత విహారం చేసే మహాసన్యాసి శ్రీరామతీర్థులు. వారి ఉన్నత ఆదర్శాన్ని - అంటే వారిజీవిత జీవలక్ష్యాన్నే నేను అధికంగా ప్రేమించింది.

గౌరవించింది - స్తుతించింది. వారి నిర్యాణా నంతరం, నేను నా ఉరుదు వారపత్రిక 'సద్ధర్మ ప్రచారక్'లో వ్రాసింది యిది.

ప్రాపంచిక పదవులు, గౌరవాలు వారిని మోహింపచేయలేదు. వారి దృష్టిలో వాటికి

విలువే లేదు. అందుచేతనే వారు సన్యసించారు. వారి ప్రవర్తన ఆదర్శవంతమైనది. నేటి సన్యాసులకు ఉదాహరణ, లక్ష్యమూ, నిరాడంబర జీవి.

శ్రీ శ్రీభాష్యం రామశాస్త్రులు.

వారి అభిప్రాయాలు కొన్నింటితో నేను ఏకీభవించకపోయినా, వారియందు నాకు అచంచలమైన గౌరవం ఉన్నది. సంవత్సరన్నరక్రితం, వారిని హరిద్వారంలో కలుసుకొని, అనేకవిషయాలు ప్రసంగించాను. భారత విద్యావిధానంలో, సమగ్రంగా సంస్కృతీకరంగా మార్పువస్తేనేగాని మాతృదేశం ఔన్నత్యం పొందదని వారి దృఢ విశ్వాసం.

ప్రాచీన గురుకుల విద్యావిధానం కావాలని వారుద్ఘాటించారు. ఒక కోటిరూపాయలు పోగుచేసి జాతీయ విశ్వవిద్యాలయం స్థాపించి ఆర్యభాషలో బోధించాలనీ, సనాతన బ్రహ్మచర్యాశ్రమ జీవితాన్ని పునరుద్ధరించాలనీ, వారి ఆశయం.

వారు జపాన్, అమెరికా దేశాలు పరివ్రజించారు. వారి సౌశీల్యం అమెరికావాసులను ఆకర్షించింది. ప్రెసిడెంటు రూజువెల్టుకూడా, ఈ హైందవ సన్న్యాసిని అభినందించడానికి వచ్చారు. అనేక అమెరికా విశ్వవిద్యాలయ కార్యనిర్వాహకులతో, సంప్రదించి అక్కడి భారతీయ విద్యార్థులకు ప్రత్యేక సౌకర్యాలు కల్పించారు. దేశీయపత్రికల్లో, జాతీయ పునర్నిర్మాణానికి, విద్యావిధానం మార్పుచెయ్యాలని దేశీయ సంప్రదాయాన్ని అనుసరించమని, అనేక ప్రముఖవ్యాసాలు వ్రాశారు.

మతసంస్కరణ విషయంలో; రామతీర్థుల అభిప్రాయాలతో భేదించవచ్చు. కానీ, రామతీర్థుల దేశభక్తి నిర్వివాదమైంది. దేశానికి తన సర్వస్వాన్ని బలిచేశాడు. వారి స్వర్గమనం - అఖిల భారతదేశమూ పరితపించతగింది.

బ్రహ్మధామంలో రామతీర్థులు తన భారత జాతి, ఆత్మ సాక్షాత్కారము, నిర్భయ స్వాతంత్ర్య

మూ, పొందడానికి ముందడుగు వేస్తూ వుండడం చూచి, ఆనందంలో పొంగిపోతారు.

గురుకులాశ్రమం,
హరిద్వారం,
15 జూలై 1921.

శ్రద్ధానంద సన్యాసి.

---

శ్రీ శ్రద్ధానందులు, నవయుగ మహాతపస్వి. ఆర్యసమాజ స్థాపనాచార్యులైన శ్రీ శ్రీ భగవత్పాద దయానంద సరస్వతీ స్వాముల ముఖ్యశిష్యులు. దేశకళ్యాణానికి, ప్రాణత్యాగం చేసిన మహావీరుడు.

సం॥ పా.

ఓం

# సంపాదకీయం



బ్రహ్మస్వరూపులార! స్వీకరించండి. యుగ యుగాలనుండి, మానసిక దైహిక పారతంత్ర్య తమస్సులో మునిగి కన్నీళ్ళలో కరిగిపోతున్న పతిత సోదరులకు - ఇదిగో రాముని అభయసందేశం!

ఈ ఉపనిషద్గానము వినండి. ఈ తథాగతామృత బిందువులు త్రాగండి. బ్రహ్మానంద రసప్రమత్తులై నరకాగ్నుల్లోనుంచి నిర్భయంగా నడుస్తూ, 'అహం బ్రహ్మాస్మి' అని ఉద్ఘోషించండి.

మళ్ళీ నైమిశారణ్యాలు చిగిరించాలి. గోమతీ తటాలు ఉపనిషద్గానకోలాహలంతో నిండిపోవాలి. భారతవర్షం బ్రహ్మధామమై భాసించాలి!

ఓం. ఓం. ఓం.

సంవత్సరన్నరకిందం, రాముని సంపూర్ణోపన్యాసాలు ప్రథమసంపుటం ప్రకటించాము. క్రమంగా 8 భాగాలూ ప్రకటించాలని ఆశ్రమోద్దేశం. కానీ, వ్యతిరేకమైన యుద్ధవాతావరణంచేత రెండోభాగం ప్రస్తుతం ముద్రింపించలేక పోయాము. అయితే యీ పరిస్థితుల్లోనే రాముని అమృతసందేశాలు అవశ్యం గావడంచేత, 8 భాగాల్లోని మహావాక్యాలు ఈ గ్రంథరూపకంగా ప్రకటించాము. దీనికిమూలం 'Heart of Rama' అనే ఆంగ్లగ్రంథం.

సనాతన - ఆధునికమహర్షి పుంగవుల సమన్వయ స్వరూపుడైన రామదేవుల దివ్యసందేశాలు, నేటి సంకులభారతానికి ప్రాణభిక్ష. - ఇది విజ్ఞులు గుర్తిస్తారుగాక.

భయంకరమైన యీ వ్యతిరేక వాతావరణంలో దురంత కష్టాల్లో నలిగిపోయినా, యీ రామసేవా కార్యం చేయగలిగినందుకు పరమానంద పడుతున్నాను.

ఇదేవిధంగా రాముని సంపూర్ణోపన్యాసాలు, సర్వసంపుటాలు ప్రకటించడానికి ప్రయత్నిస్తున్నాము- అది రామానుగ్రహం.

ఈ పవిత్రోద్యమంలో నాకు అనల్పసహాయం చేసిన ఉదాత్తభావులు శ్రీ ఈదర వేంకట్రామయ్య పంతులుగారు, శ్రీ గెంటేల నారాయణరావు పంతులుగారు నిరంతరాభివందనీయులు.

అనువాద కార్యంలో నాకు తోడ్పడిన ప్రబుద్ధ హృదయులు, శ్రీరామదాసు, సుబ్రహ్మణ్యం, ఆంజనేయులు - వీరికి నా ధన్యవాదాలు.

అదిగాక, ఈ రామసేవాకార్యంలో పనిచేసిన బాలయోధులు శ్రీ రంగారావు, వేంకటేశ్వరరావు, శ్రీనివాసరావు (బ్రహ్మానందులు) లను ఆలింగనం చేసుకుంటున్నాను. ఈ దివ్యప్రచారంలో నాకు అత్యుత్సాహం కలిగించిన శ్రీశ్రీ తీర్థచరణ, పేరంటపల్లి స్వామిజీవారికి, శ్రీ పిన్నింటి రామారావు గారికి, రాఘవగపు రామలింగం, సుభానుసింగు గార్లకు నా ధన్యవాదాలు.

సోదరులారా! యీ మహాధర్మయజ్ఞంలో అందరూ పాల్గొని, యీ రామకార్యం విజయంకరం చేస్తారుగాక!

ఓం తత్సత్! ఓం. ఓం. ఓం.

శ్రీరామతీర్థ సేవాశ్రమం, 24—6—1914. } కే. శ. ప.

# శ్రీ పరమహంస రామతీర్థస్వామి

పూని కొట్టుకు గాలి వానల మధ్య
బ్రహ్మ గీతంబుల బాడుచు మనము
మన మహా ప్రస్థాన మంత్ర రాజంబు
నుచ్చరించుచును మహోత్సవం బొదవ
తేలిపోదా మహా తెప్ప పైనెక్కి...
భయమేమి లేదహా భయమేమి లేదు.
తత్త్వమసి, తత్త్వమసి, తత్త్వమసి! అహహా!
ఓం అహం బ్రహ్మాఽస్మి ఓం. ఓం. ప్రశాంతి!

... ... ...

శ్రీరామ తీర్థస్వామి మొదటిపేరు గోస్వామి తీర్థారాముడు. పంజాబు దేశంలో 'గుజరన్వాలా' జిల్లాలో 'మురళీవాలా' అనే జనపదంలో, ఒకపవిత్ర బ్రాహ్మణ కుటుంబములో, జన్మించారు. ఈ వంశం

లోనే * గోస్వామి తులసీదాసనే మహాత్ముడు జన్మించింది. రాముడు పుట్టిన కొద్ది రోజులకే తల్లి మరణించింది. అప్పటి నుంచి, అన్నగారైన గోస్వామి గురుదాసు, వృద్ధురాలు మేనత్త తీర్థాదేవి, యీ శిశువును పెంచి పెద్దవాడిని చేశారు. జ్యోతిష్కులు, ఇతని లక్షణాలు చూచి, విశ్వదీపకు డవుతాడని చెప్పారు. భారత భాగవతాది పురాణ శ్రవణమంటే బాలరాముడికి మహాప్రీతి. అతని సాధారణ మేధ. పవిత్రశీలమూ, ఏకాంత ప్రేమకు, ఆ వూరి వాండ్లందరూ ఆశ్చర్య పడుతుండేవాండ్లు.

'మెట్రిక్యులేషన్' క్లాసునుంచీ ఆయనకు కళాశాలా పరీక్షలలో మహోన్నత స్థానమే దొరికింది. బి. ఏ., లో అగ్ర స్థానంలో ఉత్తీర్ణుడైనాడు. తనకు అభిమానమైన గణితశాస్త్రంలో, యం. ఏ., పదవి అలంకరించాడు. లాహోర్ క్రైస్తవ కళా

* ఈ తులసీదాసు రామాయణకర్త కాదు. పంజాబులో మహాప్రసిద్ధి కెక్కిన యింకొక భక్తుడని ప్రతీతి. కొన్ని శతాబ్దాల క్రిందటి వాడు. ఈయన జననం చేత వంశం తరించింది. ఆయనకు అనేకమంది అనుచరులున్నారు సం.పా.

శాలలో గణిత శాస్త్రాధ్యాపకుడుగా నియమితు డైనాడు. రెండు సంవత్సరాలు ఆ ఉద్యోగం నిర్వ హించాడు. తరువాత కొన్నాళ్లు ఓరియంటల్ కాలేజీలో రీడర్‌గా ఉన్నాడు. పాఠశాలలో అధ్యాపకు లందరికీ రాముడే ఆదర్శంగా ఉండేవాడు. వాళ్లంద రికీ రాముడంటే ప్రేమ. గవర్నమెంటు కాలేజికి ప్రిన్సిపాలయిన 'డబ్ల్యు బెల్' దొర, రాముని ప్రత్యే కాభ్యుదయాన్ని చూచి 'ప్రావిన్షియల్ సివిల్ సర్వీసు' పోటీపరీక్షకు వెళ్ళ వలసిందని కోరాడు. కాని రాముడి అభిలాష తాను కష్టించి ఆర్జించిన గణితశాస్త్రాన్ని అధ్యాపన చెయ్యాలని ఆరోజుల్లో తాను కేంబ్రిడ్జి వెళ్లాలని అనుకొన్నాడు. కాని రాముని అభ్యుదయం ఇంకోపథంలో గుప్తమైవుంది. కనుక ఆ 'స్కాలర్ షిప్' యింకో మహమ్మదీయ యువకుడికి నివ్వ బడింది.

ఎట్లయితేనేమి రాముడు 1900 సం. జులైలో అరణ్యాలకు నిర్గమించి, ఒక సంవత్సరానికే సన్యాసి అయినాడు.

రాముణ్ణి దర్శించడం, తన జీవితానికి నూతన ప్రారంభ మివ్వడము. ఆయన చూ స్తేచాలు. భేద భావాలు నశించుతాయి. మానవ మనస్థితి ఒక్క సారి దేవత్వాన్ని అధిగమిస్తుంది. నీ హృదయం నూతన నిర్మల.భావతరంగిత మవుతుంది. సర్వసంశ యాలు విచ్ఛిన్న మవుతాయి. అజ్ఞాననిద్ర నశి స్తుంది. ఆత్మాభిముఖుడవౌతావు.

'రాము డెప్పుడూ ఆనందంగా వుంటాడు. ఆయన ఆనందం అవినాశన మైంది. ఆ మందహాసం అని వార్యమైనది' అన్నాడు. ఒక అమెరికావాసి, 'సెయింటు లూయిస్ ప్రదర్శనశాలలో జరిగిన మహామత సభామధ్యంలో రామతీర్థస్వామి ఒక్కడే చూడదగిన మహావ్యక్తి' అని వార్తాపత్రికలు పేర్కొన్నాయి. సందేహ ప్రసంగాలలో రాముడు నవ్వేవాడు. కొన్నినిముషాల పర్యంతమూ, వూరక నవ్వేవాడు. మానవుడిని గురించి భగవంతుణ్ణి గురించి చేసే ప్రశ్నలకు తన మనోహర వ్యక్తి త్వమూ, సుందర మనోనిశ్చలతే, తగిన ప్రత్యుత్తి

రాలసి అవ్యక్తంగా చెపుతున్నట్లుండేది. ఆయన మందహాసాలు మెఱుపులవిధంగా భాసించేవి. ప్రజలు స్తబ్ధులై పోయేవారు. అతనిపేరు రామ పాదుషా. (రామచక్రవర్తి) ఎందుకంటే ఆయన బ్రహ్మానందజీవితం నిజంగా ప్రాపంచిక చక్రవర్తుల వైభవాన్ని పరిహాసాస్పదం చేసింది.

ఆయన ప్రేమస్వరూపి, నీచులయందు కూడా అనంతప్రేమ. సర్వంలో ఈశ్వర సందర్శనం చేసిన మహాత్ముడు. ఆయనకు భేదమే లేదు. సర్వంలో తనను, తనలో సర్వాన్ని, చూచిన, సంపూర్ణ ప్రేమస్వరూపి.

రాముడు గాఢోద్విగ్నపరిస్థితుల్లో, తనకిష్టమైన వాటిల్లో, కొన్ని ఉరుదు పారసీకగేయాలు కండ్లు మూసుకొని, బాష్పధారలు కారుస్తూ చదివేవాడు. తద్భావైక్యం పొందేవాడు. కొన్ని గంటలవరకూ, అలా రాముడు తాదాత్మ్యంపొంది, సమాధిపొందే వాడు. బహిరంగోపన్యాసాల మధ్యంలో, ఓం, ఓం అని ప్రణవగానం చేస్తూ, అట్లాగే దేహస్మృతి

విహీనుడై. సమాధి పొందేవాడు. అందుకనే అమె
రికా మిత్రులు 'రాముడు ఎప్పుడో శరీరస్మృతిలో
వుండేది! సర్వదా దివ్యత్వంలోనే వుంటాడు.'
అని అన్నారు. ఆయన స్వరూపమాధుర్యం వర్ణనకు
అతీతమైంది. ఆయన వీక్షణం నరకాన్ని స్వర్గం
చేస్తుంది.

రాముడు సముద్రయానం చేస్తున్నప్పుడు, వారి
తోను సహయానం చేస్తున్న అమెరికనులు,
స్వామిని అమెరికాదేశీయుడుగా గ్రహించారు.
జపానీయులు స్వామిని, తమ దేశీయుడుగా ప్రేమిం
చారు. 'రాముడి విద్యున్మందహాసాలు ఇంకా
మా గదుల్లో గోడలమీద మెరుస్తున్నాయని'
వాండ్లు అంటారు. స్వామి ఫాలభాగంమీద వెలుగు
తున్న పవిత్రతను, వాండ్లు ఇంకా తమ ప్రియ
తమమైన 'ఫ్యూజియామా' (Fugiyama) హిమ
శిఖరంగా గుర్తించుకున్నారు. కాషాయవస్త్రంతో
వెలుగుతున్న స్వామి స్వరూపం చూచి, ఒక జపా
నీయకళావేత్త, 'ఒక అగ్నిస్తంభం - మాటలు

కాదు - జీవితకణాలనే వెదచల్లుతున్నట్లున్న'దని నిర్వచించాడు. క్యాలిఫోర్నియాలో, 'స్వామి, దివ్యజ్ఞానజ్యోతి; హిమశిఖరాలనుండి వచ్చినధీశాలి అని అభినందించారు. కొలంబియాలో, వారు పోయిన ప్రతిచోటా, ఉపన్యసించారు. 'నేను నాశనం చేయడానికి రాలేదు. సఫలవంతం చేయడానికి వచ్చాను.' అని వచించారు.

అనేక క్రైస్తవాలయాలల్లో స్వామి ఉపన్యసించాడు. అవి అభినవ్యమైనవి. మనోహరమైనవి. అక్కడ వున్నది రాముడు రెండు సంవత్సరాలు. స్వామి విశ్వైక్య హృదయాన్ని అభి నందిస్తూ, భారత దేశానికి తిరిగి వస్తున్నప్పుడు, అమెరికా సోదరులు పాడిన గేయం చూడండి.

'నవచూతశాఖ నానందంబుతోడ
గొంతెత్తి పాడెడి కోయిలరీతి
తన దివ్యపద్యసుధారసం బొలుక
మారాము డానందమయుడై పాడెడిని

ఉదరంబులో నింపుకున్నట్టి దివ్య
ప్రాచ్యసనాతన ప్రాభవజ్ఞాన
వర్షంబు వెదచల్లు పశ్చిమధరణి
భగవంతు డంపిన పక్షివిధాన

రాముడు మాలోక రమ్యసందేశ
మును దెచ్చె, మమ్ముల ముదమున నేల
ఆ దివ్యసందేశ మందు ధ్వనించు
ఈ సర్వ మాపరమేశ్వరుకొఱకు

ఆ పరమేశ్వరుం డఖిలంబుకొఱకు
ఆ దివ్యసందేశ మద్భుతరీతి
లోకచక్రవిధాన దుర్నిరీక్ష్యముగ
దిశదిశాక్రాంతమై తేజరిల్లెడిని

స్వర్గదివ్యజ్యోతి భాసురకిరణ
జాలముల్ వెదచిమ్మి, సకలజాతులకు
విమలనవోదితప్రేమ యయ్యాదిమ
మధుర స్వరూపరామా! వందనములు

వెన్నెలకిరణముల్ వెదచల్లుచున్న
నీ చిరునవ్వుచే నిఖిలవిశ్వంబు,
నరకాగ్నిశిఖలలో దురపిల్లుచున్న
ప్రాణియు నానందవార్థి దేలెడిని

ఆచిరునవ్వున కఖిలవందనములు.
తరళమే యీ జగద్రంగంబునందు
కాయముల్ మరియిట కలియకుండినను,
అఖిలసత్యస్వరూపం బీవయనుచు

అమరబాంధవుడవు, అఖిలుండవనుచు
మే మెఱుంగుదుము ఓరామ! యెట్లనిన
నీలోన నీశుండు నివసించుచుండు
నీ వీశ్వరునియందు నివసింతు వెపుడు.

ఈజిప్టులో మహమ్మదీయులు, స్వామినిహార్దపూర్వకంగా ఆహ్వానించారు. వారిమసీదులో పారశీకభాషలో అక్కడ ఉపన్యసించారు. మరునాడు పత్రికలు 'స్వామిరామతీర్థ, హిందూతత్వవేత్త వారిని దర్శించడం మహాదృష్టమని' వర్ణించినవి.

టోకియో ఇంపీరియల్ యూనివర్సిటీ ప్రొఫెసరు టాకకుసు (Takakutsu) 'తానెన్నడూ చూడనటు వంటి హిందూవేదాంతి రాముడొక్కడే' అని నిర్వ చించాడు. ఆయన ప్రేమ అలాంటిది. భారతదేశా నికి తిరిగివచ్చిన తరువాత మిటారిలో కొందరు స్వామిని వారికొక సంఘాన్ని స్థాపించవలసిందని అడి గారు. అప్పుడు రాముడు ఆనందాశ్రువులు కారుస్తూ భారతదేశంలో పనిచేసే సర్వసంస్థలూ తనవేనని. వాటిద్వారా తాను పనిచేస్తానని నిర్వ చించారు.

రాముని అనంతవిశ్వమయప్రేమ వర్ణనాతీత మయింది.

రాముడు సంపూర్ణ ఆత్మజ్ఞానలబ్ధికి తీవ్రకృషి చేశాడు. ఆయన చూచినదల్లా భగవంతుడే. మహా బ్రహ్మవేత్త. జ్ఞాన ధీ శక్తులు స్వామిలో మగ్నమై నవి. రావీనదీతీరంలో అనేక నిశీథాలు రాముడు ఆధ్యాత్మికసాధనలు చేశాడు. అనేక రాత్రుళ్ళు తపించాడు - దుఃఖించాడు. ప్రొద్దున్నే చూస్తే

ప్రక్క అంతా తడిసివుండేది. స్వామి భగద్విరహ వేదన ఆనాటి నిశీథాలకే తెలుసు. ప్రారంభదినాలలో రాముడు సనాతనధర్మసభల్లో భక్తినిగూర్చి, కృష్ణునిగూర్చి, ఉపన్యసించేటప్పుడు, ఆయన నోటి నుండి వెడలినప్రతిమాటా కన్నీటితో తడసివుండేది. అలాంటిసాధనా దినాలలో రాముడు చెప్పేవాడు- తనకు అనేక పర్యాయాలు ప్రత్యక్షంగా శ్రీకృష్ణ దర్శనమైందని.

రాముడు అగర్భతపస్వి - విద్యార్థిగా వుండేటప్పుడు, దురంతకష్టాలు, మహాదారిద్ర్యం అనుభవించాడు. కొన్నిసమయాల్లో తినడానికి తిండికూడా లేకుండా పోయేది. ఆ కష్టాలు వ్రాయలేము. సామాన్యపువాడెవడైనా ఆకష్టాలకుఆత్మహత్యచేసుకొనేవాడు. రాత్రింబవళ్ళు తన విద్యావ్యాసంగంలో తీవ్రకృషి చేసేవాడు. తన స్వదృష్టితో సర్వతత్త్వాలు పరిశోధించాడు.

శ్రీ శంకర, కణాద, కపిల, గౌతమ, పతంజలి, జైమిని, వ్యాస, కృష్ణాదుల సిద్ధాంతాలు, వాటితోపాటు,

కాంటు, హెగెల్, గెధె, ఫిచెట్ (Fichte) స్పినోజ (Spinoza) కోమ్టు (Comte) స్పెన్సర్, డార్విన్, హెకెల్ (Haeckel) ట్యాండల్ (Tyandal) హక్లీ (Hukly) స్టార్, జార్డన్ (Gordon) ప్రొఫెసర్ జేమ్సు మొదలైన వారి సిద్ధాంతాలు సమగ్రంగా జీర్ణించు కున్నాడు. పారశీకము, ఇంగ్లీషు, హిందీ, ఉరుదు, సంస్కృత, సారస్వతాలు రాముడు నూరి త్రాగాడు. 1906లో చతుర్వేదాలు పఠించాడు. ప్రతి ఋక్కుకూ గంభీరార్థం చెప్పగలిగిన మహా పండితుడు. ఆయన ముప్పది మూడేండ్ల జీవితంలో ఒక్క నిముషం కూడా వృథా చేయనట్లు కనబడు తుంది. తన శరీరపతనం వరకు కష్టించిన కర్మయోగి.

రామునిలో గర్వచ్ఛాయ అణుమాత్రమూ లేదు. తన ఆత్మదృష్టితో న్యాయాధికారి విధంగా ప్రవర్తించేవాడు. విద్యా మహార్ణవాన్ని ఆపోశన పట్టాడు. నిరంతర జ్ఞాన తృష్ణ తనలో పొంగులు వారింది. జనసంకులమైన లాహోర్ నగరం రాముని హృదయానికి తృప్తికరంగా లేదు. సహాయం దొరి

కినపుడల్లా రాముడు రామాలయం పర్వ తారణ్యా లకు పోయి. ఉపనిషత్తులను, సనాతన,ఆర్య,బ్రహ్మ విద్యా రహస్యాలను గూర్చి ధ్యానం చేసేవాడు.

హృషీకేశ ప్రాంతంలోని బ్రహ్మపురి అరణ్యా లలో రాముడు, బ్రహ్మజ్ఞాన సిద్ధి పొందింది. అక్క డనే రాముడు భయ రహితమైన, ఆనందమయ రహితమైన, అద్వైత సిద్ధి పొందాడు. రాముడే ఒక విశ్వం. అందులోని నగరాజునాట్యాలు తేజో మయ మైనవి. ఆవీధుల్లో బుద్ధుడు భిక్షాపాత్రతో నడి చాడు. క్రీస్తునత్యప్రబోధం చేశాడు. రాముని మనో వాతావరణంలో ఏ ఉత్తముడూ మరణించలేదు.

శ్రుతి స్మృతులు, పద్యాలు, పాటలు, భావాలు, తత్త్వ ప్రశ్నలు, మతము, రాజకీయాలు, సాంఘిక విషయాలు, స్వామి దివ్య తేజంలో విలీనమై, నవ్య సౌందర్యంతో బహిర్గత మైనవి.

సర్వాన్ని భగవదాత్మ కాంతితో దర్శించాడు. అందుకే, తనకు వేరుగా ఏదీ కనబడలేదు. సూర్యుని అరుణ కిరణాలు తనకండరా లన్నాడు. ఆయన

నవ్వితే అది వర్షా కాలంలో సూర్యకాంతి. ఆయన దుఃఖిస్తే అది గ్రీష్మకాల మధ్యంలోని వర్ష పాతం. రాముడు మేఘచ్ఛత్రాల నీడల్లో గమించేవాడు. కీకారణ్యా గర్భాలలో వసించేవాడు. భయంకర మైన నిశీథ సమయంలో దారులేని కొండలోయల్లో నిర్గమించే వాడు, పరమహంసయై, స్వేచ్ఛావిహారం చేశాడు. రాముడు ప్రకృతితో నిగూఢ బాంధ వ్యాన్ని సృష్టించు కొన్నాడు.

రాముడు మహాకవి. కొండవాగుల మధుర గానమే ఆయనకు తోడు. వృక్ష చ్ఛాయల్లో, పక్షు లాయనతో ప్రకృతి రహస్యాలు మాట్లాడుతాయి. విశ్వసంగీతం ఆయనకు వినిపించింది. జగత్తు జనార్దన స్వరూపంగా రాముడు దర్శించాడు. తాండవిస్తున్న సముద్రతరంగాల్లో, అరణ్యవీచికల్లో, ఆరణ్య కతలో, రాముడు విశ్వ సౌందర్యాన్ని దర్శించాడు. ప్రకృతి హృదయంలో ఐక్యం కావడమే ఆయన సత్య ప్రవర్తనాభిప్రాయం.

హిమవదరణ్యగర్భాలలో రాముడు నిమీలిత

నేత్రుడై, నిశీథ సమయాలలో మృగ సమూహాల మధ్య ఓంకారగాన పారవశ్యుడై, సంచరించే వాడు. ఈ విధంగా రాముడు సత్యం కోసం సర్వసంగ పరిత్యాగాగ్నిలో జీవితం ఆహుతి చేశాడు. పరమ శివుడై భాసించాడు.

మహోన్నతమైన పర క్షేమాభిలాష రాముని హృదయానికి ఉన్న ఒకచిన్న అలవాటు. ఒక క్షణం కూడా వ్యర్థం చేయకుండా స్వామి హైందవ జన సామాన్య సముద్ధరణానికి రాత్రింబవళ్లు కృషి చేశాడు. దీనజనుల కోసరమై పరితపించాడు. రాముడు నిరాడంబరుడు. అమెరికా నుండి తిరిగి వచ్చేటప్పుడు స్వామి అమెరికను లిచ్చిన అభివందన పత్రాల కట్టను చించి, సముద్రములో పారవేశాడు. అలాంటిది స్వామి నిరాడంబరత! నిస్స్వార్థత!

రాముని అద్వైత (సర్వాత్మసమానభావం) సిద్ధాంతమే భారత దేశంలోని జాతులయొక్క, వివిధమతాలయొక్క, పరస్పరకలహాలను, సమా

భావం వరచగలిగింది. స్వామి ప్రేమ సిద్ధాంతమే. జాతీయవ్యక్తిగత శక్తులను వ్యయపరుస్తున్న రోగాని కి మందు. సైన్సులో, మతంలో చెదరగొట్టబడిన వశ్వాన్ని సంయోగం చేసిన స్వామి ప్రవర్తనమే, మానవ దైనందిన జీవితానికి ఆదర్శం. ఆయన బహిరంగకర్మభావం ఒక్కటే – జనసామాన్యాన్ని అజ్ఞానదాస్య విముక్తుల జేయడం.

స్వామి వ్యక్తిత్వము, స్వేచ్ఛకు, స్వాతంత్ర్యానికి దీపగృహం. ముక్తికి త్రోవ.

పారతంత్ర్యదుర్గభేదనం చేసిన రాముని మహాప్రస్థాన విజయ గీతిక వినండి.

'భేదించు భేదించు – అజ్ఞానాన్ని భేదించు!
మేలుకో – మేలుకో. ముక్తి పొందు.
స్వాతంత్ర్యం! స్వాతంత్ర్యం!
ముక్తి! ఓం.

... ... ...

మేఘమండలాన్ని చీల్చుకొనివచ్చిన మెఱుపులు ఎంతసేపు వుంటాయి. దివ్యపురుషులు స్థూలరూపాలతో అలాగే వుంటారు. రాముడు అమెరికానుండి భారతదేశానికి తిరిగివచ్చినతరువాత మళ్ళీ హిమవదరణ్యం చేరాడు. అక్కడ బ్రాహ్మాపారవశ్యంతో స్వామి వున్నాడు. అంతకంతకు కించి ద్దేహాస్మృతి కూడా లేని స్థితివచ్చింది. పండినపండు కొమ్మనెన్నాళ్ళు వుంటుంది? వారి అఖండ బ్రహ్మానందాన్ని దేహం భరించలేక పోయింది.

ఒకనాడు స్వామి తెహరి గహ్వారవాల్ దగ్గర పవిత్ర గంగానదిలో స్నానం చేస్తూ, శరీర పరిత్యాగం చేశారు. గంగా గర్భం ఓంకారంతో ఘూర్ణిల్లి పోయింది.

ఓం! ఓం!! ఓం!!!

స్వామి శరీర పరిత్యాగానికి ముందు నీ విధంగా వ్రాశారు. "ఓమృత్యు దేవతా! నీకిష్టమైతే యీ శరీరం తీసుకపో. నా కేమీ ఫరవాలేదు. నేను ధరించే డానికి అనేక శరీరా లున్నాయి. దివ్యమైన మనోహర చంద్ర కిరణాలు ధరించి జీవిస్తా. కొండవాగుల్లో నదీప్రవాహాల్లో దివ్యగానం చేస్తా. సముద్ర తరంగాల్లో నృత్యం చేస్తా. సగర్వంగా వీచే మందమారుతాన్ని నేను. ఝంఝూమారుతాన్ని నేను. ఈ నాస్వరూపాలన్నీ మార్పుచెందే సంచారి దేహాలు నేను. పర్వత శిఖరాలనుండి దిగివచ్చాను. చచ్చిన వాండ్లను బ్రదికించాను. నిద్రించిన వాండ్లను లేపాను. అనేకుల ముఖసౌందర్యాలు బహిర్గతం చేశా. దుఃఖితుల కన్నీళ్లు తుడిచాను. కృష్ణపక్షిని, గులాబిని చూచాను. ఆనందించా. నేను ప్రతిదాన్నీ స్పృశించాను. శలవుతీసుకున్నా. వెళ్లి పోతున్నాను. నాయిష్టం వచ్చినట్లు విహరిస్తా. నన్నెవరూ కనుక్కోలేరు. నేనేమీ ఉంచుకోను."

ఓం! ఓం!! ఓం!!!

ఇలాంటి అమరమైన రామపరమహంస జీవితం ప్రత్యేకంగా ఎవరు వ్రాయగల్గుతారు? విశ్వమే ఆయన జీవితగ్రంథంలోని ఒక అధ్యాయం. అట్టి రామదేవులకు...!

ఈ సహారా యెడారిమధ్యమున నెవరు
పుణ్యమూర్తులు చలివేంద్ర పెట్టినారు!
వారిశల్యాకారమ్ములు గుంజలుగ జేసి
చర్మములదీసి దడికట్టి వెంద్రుకలను
పైనగప్పియు పందిలి వైచినారు!
ఈభయంకరఘోరనిదాఘవశత
చావ నున్నట్టి ఓ పాంథజనములార!
రండు రండోయి మన యదృష్టంబు పండె.

ఓం.

ఓం

# విషయసూచిక

# భారత దేశం

1

'సర్వజాత్యైక్యత' నరనరంలో ప్రతిస్పందించి నప్పుడు తప్ప, మానవుడు సర్వేశ్వరానుసంధానం పొందలేడు.

2

భారతీయులు తమలో పరస్పరం 'అఖిల భారతాన్ని' దర్శించి దేశసేవకు బద్ధకంకణులగుదురు గాక!

3

జాతిధర్మం వ్యక్తిధర్మంకంటె మహోన్నతం. ఈ రెంటికి సామరస్యమే సౌఖ్యప్రదం.

4

జాత్యభ్యుదయాన్ని ఉద్దేశించి చేసే ప్రతి కార్యమూ ప్రకృతిసేవ; దేవతా సేవ.

5

భగవంతుణ్ణి తెలుసుకోను సన్యాసప్రవేశం కలిగి ఉండాలి. అంటే సర్వస్వార్థాన్ని పరిత్యజించి అంఖిడ భారతాత్మతో తాను సమైక్యం పొందడం.

6

భగవంతుణ్ణి లేక బ్రహ్మానందాన్ని పొందడానికి, బ్రాహ్మణభావాన్ని కలిగిఉండు. అంటే జాతీయాభ్యుదయానికి నీ బుద్ధిని అంకితం చెయ్యి.

7

బ్రహ్మానందాన్ని తెలుసుకోడానికి నీకు క్షత్రియ భావం ఉండాలి. అంటే అనుక్షణం దేశానికి ప్రాణం అర్పించడానికి సంసిద్ధంగా ఉండటం.

8

భగవంతుణ్ణి తెలుసుకోను నీకు నిజమైన వైశ్య భావం ఉండి తీరాలి. నీ ఆస్తికి జాతితరఫున యాజమాన్యం వహించడమే నీకర్తవ్యం.

9

ఇహంలోగాని పరంలోగాని బ్రహ్మానందాన్ని, రాముణ్ణి తెలుసుకోవాలంటే, మనోమయమైన నీ ఆంతరంగిక ధర్మానికి సజీవమై స్థూలరూపమైన సత్యాన్ని ఇవ్వడానికి నీవు, యీ సన్యాసభావం అనుష్ఠించాలి. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య వీరత్వం

ద్వారా ఒకప్పుడు పవిత్ర శూద్ర సోదరులపైన నెట్టివేసిన కాయకష్టం. ని సర్వశరీరాన్ని వినియోగించి నిర్వర్తించడమే. సన్యాసభావానికీ, హరిజనులకూ పెంపొందించే నేను ఇదిఒక్కటే మార్గం. మేలుకో! మేలుకో!

10

ఒక పేరోగం ఒకే దేశంలోను ఉన్నది. జాతులు ధర్మ జీవనం వల్ల స్వేచ్ఛను పొందుతాయి. అధర్మ జీవనం వల్లనే వ్యక్తులు సుహాస్థితాతారు. దైవత్వాన్ని అధిగమిస్తారు.

11

ధన వాంఛను పరిత్యజించి వైదాంతికమైన త్యాగజీవితాన్ని అనుసరించడం లోనే జాతులకూ, వ్యక్తులకూ, మోక్షం ఉన్నది. వేరే ఇంకో దారి లేదు.

12

పరస్పరస్పర్థలచేత భారత దేశంలోని అసంఖ్యాక శక్తులు సముగ్రఫలితాన్ని పొందడం లేదు. అది విచారకరం కాదా? కారణం ఏమిటి? ఒక సంఘం ఇంకో సంఘపు లోపాల మీద దృష్టి ఉంచడమే.

13

అహో! గౌరవానర్హమైన గౌరవమా!... మీర
పరస్పరం ఒకరి తప్పులు ఒకరు ఎంచు తున్నంత
వరకు, దేశంలో సామరస్యం, ప్రేమ ఉండవు.

14

విజయింకరమైన జీవనకళా రహస్యం మానవ
హృదయాన్ని వికసింప జేయడమే, ఆ పవిత్రహృదయ
అందరినీ సమంగా ప్రేమిస్తుంది.

15

'అమ్మ' అనే మాట హైందవుని హృదయాంతరంలో
గాఢాతిగాఢమైన ఉద్రేకం పుట్టిస్తుంది.

16

హిందూదేశంలో చాలానదులు పవిత్రనగరము
ప్రవాహము, కొండ, రాయి, జంతువు, చేతనత్వ
పొంది, పావనంగా భావించబడు తున్నాయి. సర్వ
మాతృభూమిని దైవంగా పూజించడానికి, కనపడే
ప్రతి వస్తువు అందరికి భక్తిప్రేరణం చేయడాని
ఇదే తరుణము.

17

మీరు కట్టిన ధవళోన్నత దేవాలయ గోపు రాలు, శిలావిష్ణువులు మీ హృదయజ్వరతాపాన్ని శమింపజేయలేవు... దేశంలో దరిద్ర నారాయణు లను, కార్మిక విష్ణువులను సేవించండి! సేవించండి!

18

కృత్రిమ యజ్ఞాగ్నికుండంలో విలువగల నేతిని వ్యయం చేయడానికి బదులు మలమల మాడుతూ కండ్లలో ప్రాణాలు పెట్టుకున్న కోటానుకోట్ల దరిద్ర నారాయణుల కండలను ఎముకలనూ కీల్చి పిప్పిచేస్తున్న ఆకలిమంటలో ఎండిపోయిన ఒక్క రొట్టెముక్కనైనా మీరు ఎందుకు ఆహుతి చెయ్య కూడదు?

19

మానవుడికి నీవు చేయదగిన మహోత్తమ దానము జ్ఞానము. ఇవ్వాళ్ళ నీ వెవడికైనా భోజనం పెట్టవచ్చు. రేపటికల్లా మళ్ళా వాడికి ఆకలి అవు తుంది. వానికేదో ఒక కళనేర్పి, నిరంతర జీవనో పాధి కల్పించు.

20

హైందవ దాతృత్వం ఆకటితో అలమటించే కృషిక సంఘాల (శూద్రుల) కోసం అంతగా బాధ పడదు. కానీ; దేవుడు గిస్తం గుల్లో పొట్టలు పెంచు కొన్న సోమరిపోతులను మేపే దాతలను పాషాణ మత ప్రతినిధులను నేరుగా స్వర్గానికి తీసుకపోతుంది

21

పాఠం చేసే సోమరి యాచకుడికి కాస్త బిచ్చం పెట్టి, దుర్బలమానసులైన యాత్రికుడు పరలోకంలో తనకు ఆత్మభద్రత ఏదో కొంత చేశానని తనలో తాను మెచ్చుకుంటాడు. అయితే కావచ్చు కానీ ఇక్కడ జాతిని నాశనం చెయ్యడానికి కొంత చేశాడనడంలో కాస్త కూడా సంశయం లేదు.

22

ప్రజల్లో సగం వస్తులతో చచ్చిపోతున్నారు. మిగతా సగం స్పష్టమైన వృథావ్యయంలో పూడ్చి పెట్టబడుతున్నారు. అనవసర వస్తుసామగ్రి, సెంటు సీసాలు, దొంగనటనలు, డాంబికాచారాలు అనేక

రకాల* స్వల్ప విషయాలు- వాటికిచ్చిన విలువలు- అసహ్యమైన భోగాలు, అనారోగ్య దృశ్యంతో నిండివుంది.

23

చాలా కొద్దిరాబడి, దానికితోడు ఏటేటా పెరిగి పోతున్న కుటుంబంతో పాటు, అర్థం లేని క్రూర మతాచారాలకు దాసులై, వృథాగా చేసే వ్యయాలు ఈ విధంగా సగటున ప్రతి భారతీయగృహం, జాతి మొత్తానికి ఉదాహరణంగా ఉన్నది.

24

హిందూ దేశపు రాజకుమారులు, సంస్థానాధి పతులు, వాండ్లు అమూల్యమైన సర్వసంపదా శక్తి కోలుపోయి, లోపల ఏమీ లేనిగలగల లాడే బిరు దులతో పేరుకు మాత్రం మిగిలి కీలుబొమ్మ లైనారు.

25

ఈ ధనికు లనబడేవాండ్లు దుర్భరమైన భారాన్ని చూచి కనికరించడానికి బదులు క్షణభంగురమైన

వాండ్ల సంపదను ఏవగించుకుంటూ ఆధునిక సామ్య వాదులు తప్పు చేస్తున్నారు.

26

ఇంగ్లాండులో నిజానికి వాండ్లు పంటలు పండించరు. అయినప్పటికి దేశం శ్రీమంతంగా వున్నది. కారణం ? కర్మాది దేవత ఐన ఇందుకు కళలవల్ల, కర్మాగారాలవల్ల తృప్తికరంగా భుజించాడు.

27

హిందూదేశ దారిద్ర్యానికి అతి ముఖ్యకారణం; కసవు పదార్థాన్ని పరిహరించడం, చచ్చిపోయిన జంతువుల ఎముకలు స్పృశించడానికి భయపడడం, చెత్తఅని, కుళ్ళు కంపనివాటిని తృణీకరించడం.

28

భారత దేశపతనం; దాని క్షీణత్వ మూవేదాంత తత్త్వం చేత వ్యాఖ్యానింపబడింది; అది కర్మ విశేషం.

29

వెనుకటి వైభవాన్ని ఎడతెగకుండా ఎంచు

కోవడమే దేశభక్తి అనుకునేవాళ్లు కొందరున్నారు. దివాలా ఎత్తిన కోటీశ్వరుడు ఎప్పటివో వెనుకటి నిల్వలెక్కలు బండెడు చూపిస్తే ప్రయోజనం లేదు.

30

సంస్కర్త కాబోయే యువకుడా!

ఛేదించే నూతన శాస్త్రాన్ని పరిచయంచేస్తూ సనాతనాచారాలను భారతదేశపు ఆధ్యాత్మికతను నిందించవద్దు; భారతీయులు ఐకమత్యాన్ని పొందలేరు.

31

స్వార్థ (అహంకార) పరిత్యాగంచేసి, సర్వ దేవైక్యం పొంది నీవేదితలిస్తే, నీతోపాటు నీ దేశం కూడా అది తలుస్తుంది - ముందుకు నడువు, నీ దేశం నిన్ను అనుసరిస్తుంది.

32

అభివృద్ధికిసేవ - ప్రేమమార్గాలు-శాసనాలు - నిర్బంధాలు అడ్డంకులు.

33

ప్రజానాయకత్వం వహించడానికి సమర్థుడైన ధీశాలి తన సహాయకుల బుద్ధిహీనతను, అనుచరుల అవిశ్వాసాన్ని, మానవుల కృతఘ్నతనూ, ప్రజలు అభినందించక పోవడాన్ని పరిగణించడు.

34

అల్పభావాలుండే అధికుల (పెద్దలు) కంటే, ఉన్నతాశయాలుండే చిన్నవాండ్ల వల్లనే దేశం బలపడుతుంది.

35

సంపూర్ణ ప్రజాప్రభుత్వం, సర్వ సమానత్వం, బహిరధికారభారాన్ని త్రోసివేయడం, డంబాచారాలు కట్టిపెట్టడం, నిరంకుశాధికారాలను బహిష్కరించడం హెచ్చు తగ్గులను పాటించక పోవడం - ఇదే భౌతికరంగంలో వేదాంతం.

36

తనస్థానాన్ని గుర్తించుకోడానికి ప్రతిమానవుడికి సమానస్వాతంత్ర్యం ఉండాలి. నీతల నీయిష్టం

వచ్చినంత ఎత్తున వుంచుకో; కాని పాదా లెప్పుడూ నేలమీదనే వుంచు. మనుష్యులుడైనా, యిష్టపడ్డా ఇంకొకడి భుజాలమీద - మెడమీదా ఎప్పుడూ పెట్టవాకు.

37

కపటరాజకీయవేత్తలు, మూలసూత్రమైన స్వాతంత్ర్యశక్తిని, ప్రేమను గుర్తించకుండా జాతీయోన్నతికి ప్రయత్నిస్తారు.

38

యూరప్, అమెరికాల ఔన్నత్యానికి సత్య కారణం క్రీస్తు వ్యక్త్యత్వ ప్రభావంకాదు వేదాంతం అప్యక్తంగా ఆచరణలో పెట్టడమే. భారతదేశ పతనానికి కారణం - వేదాంతం ఆచరణలో శూన్యం కావడమే.

39

విదేశరాజకీయాలనుండి రక్షింపబడడానికి ఏకైక మార్గం - ఆధ్యాత్మిక ధర్మాన్ని, పరస్పర ప్రేమ ధర్మాన్ని ఉజ్జీవింపచేయడమే.

40

పవిత్రత పేరటగాని, అపవిత్రత పేరటగాని, భగవంతుని సి. ఐ. డీల మనుకొని, దేశహితానికి తోడుపడే వ్యక్తిరహస్య జీవితాన్ని శంకించి శోధించడానికి, మనకు అధికార మేముంది?

41

హైందవ ప్రజానీకంలో మనం ఉద్బోధించవలసింది విమర్శనకాదు- గుణగ్రహణత్వం; సహోదరభావం - ఐకమత్య జ్ఞానం - సర్వవ్యక్తుల సామరస్యం- కృషి ప్రాముఖ్యత.

42

సంఘాలకు, జాతులకూ, అన్నింటికీ విశిష్టంగా నీ వ్యక్తిత్వాన్ని నిలుపుకో!

43

బృహస్పతి యజ్ఞమంటే, నాబుద్ధులు (ఆలోచనలు) అన్నిటినీ, దేశీయ విజ్ఞానానికి నివేదించడం. అంటే నేను నా దేశీయులతో ఐక్యమై దేశక్షేమాన్ని వాంఛించడం.

44

పర దేశాల్లో నిన్ను నీవు పోషించుకో గలిగితే అక్కడే నిలిచిపో, అదికాక నీవు బాధాపలితమైన భారత మాతృ హృదయానికి [illegible] శోకంగా పారికే జలగవైతే అరేబియా సముద్రంలో దూకు! ఆ సముద్రం ఆతిథ్యాన్నే స్వీకరించు! మళ్ళీ యీ గడ్డ తొక్కవద్దు!

45

పాశ్చాత్య శాస్త్ర జ్ఞానం వల్ల భయపడ డానికి బదులు, హిందువులు నేడు ఆ విజ్ఞానాన్ని వారి బ్రహ్మవిద్యకు (శ్రుతి) సంబంధిగా ఆహ్వానిస్తున్నారు.

46

నీవు విషయాలను కారణాలవల్ల, తర్కంవల్లం స్థిరపరచదలచుకున్నప్పుడు, కులాభిమాన దుర్భిణీయంత్రం హృదయాలను కలువ నివ్వ నప్పుడు నీవు అపాయానికి గురి అవుతావు.

47

మతంలోని వేరు వేరు తెగల పోరాటాలు

ప్రజల్లో మానవత్వాన్ని మబ్బుల్లాగా కప్పివేశాయి అందుచేత సామాన్య జాతీయతాభావానికి గ్రహణం పట్టినట్లయింది.

48

భారతదేశ భక్తులారా!

రాతివిగ్రహాల్లో మాత్రమే బంధించకుండా, చండాలుడిలో, దొంగలో, పాపిలో, అపరిచయుడిలో, నర్సుల్లో మీరు ఆ మనోహర గోపాల బాలుణ్ణి దివ్యప్రేమతో దర్శిస్తే మీ రతనికి అత్యంత ప్రియులౌతారు.

49

పతితులని నీవు భ్రమించి పిలిచేవారంతా ఇంకా 'నిద్రలేవలేదు' కళాశాలలో చేరినకొత్త విద్యార్థులు. నీవు కూడా ఒకప్పుడు ఆ దశలో ఉన్నావు కదా!

50

ప్రియమైన భారతీయ శాస్త్రాచార పరాయణులారా!

సక్రమంగా శాస్త్రాలను ఆచరణలో పెట్టండి. జాతీయసమభావానికి, దేశధర్మం మిమ్మలను కులాచార బంధాలను సడలించండని, తీవ్రసంఘ భేదాలను తృణీకరించండని శాశిస్తున్నది.

51

నా ప్రియమైన హిందువులారా!

మార్పుకు సంస్కరణానికి విముఖత్వంచేత పూర్వాచారాలమీద వంశపరంపరంగా వచ్చే కట్టుబాట్లమీద అభిమానంచేత మీ హృదయాలు మానవత్వాన్ని మఱచిపోగూడదని ప్రార్థిస్తున్నాను.

52

కాలానుగుణ్యంగా మీరు హిమాలయ ఋషి సంతతికి చెందినప్పటికీ, నిజానికి కళలకూ, శాస్త్రాలకూ అధినేతలుగా ఉన్న యూరప్ అమెరికా దేశస్థులకు-మీకు ఉన్న సంబంధాన్ని కాదంటానికి వీలు లేదు.

53

పూర్వంనుండి ఉన్న నీ స్వదేశ సనాతన తేజమే అయిన యీనవ్య తేజాన్ని జీర్ణించుకోవడానికి నీకిష్టం లేకపోతే, పో - నీముత్తాతలతో పితృలోకంలో వసించు. ఎందుకు యిక్కడ ఆలస్యం చేస్తావు? వెళ్లిపో.

54

పూర్వం 'ఇండియా యిట్ల ఉండేది' అని ఆలోచిస్తూ కాలయాపన చేయవద్దు. ఇండియా భవిష్యత్తుకోసం నీశక్తినంతా వినియోగించు.

55

ఇండియాలో, నేటిస్వాములు, పండితులు నాళ్లజాతిపోయే సోమరిసిన్రను దీర్ఘం చెయ్యడానికి జోలపాటలు పాడుతున్నారు.

56

ఇండియాలో స్వతంత్రభావం భ్రష్టంగా చూడబడుతుంది. అంతేకాదు. పాపంగా ఎంచబడుతుంది. మృతభాషలోనుండి ఏది వచ్చినా అది పవిత్రమే!

57

ఒకశిశువు హిందువుడి గర్భవాసంలో జనించి నప్పటికే, క్రైస్తవ మతంలోచేరితే వీధిలో కుక్క కంటె నీచంగా చూడబడతారు.

58

సత్యజ్ఞానం బలాన్ని విజయాన్ని చేకూరుస్తుంది. దేహభ్రాంతి నిన్ను మూర్ఖుణ్ణి చేస్తుంది.

59

నాగరక సంఘంలో స్త్రీని జడంగా చేసి, కాళ్లూ చేతులూ కట్టి, పురుషుడు స్వేచ్ఛగా సంచరిస్తూ- ఆమెను తన ఆస్తిగా ఉపయోగించుకుంటున్నాడు.

60

స్త్రీ వ్యాపారవస్తువుగా చేయబడడం, ఏదో చెట్లో, యిల్లో, డబ్బో చెందిన విధంగా పురుషుడి చేత స్త్రీ పొందబడడం - నాగరికతా సంఘానికి తీరని కళంకం.

61

స్త్రీలకు, పిల్లలకు, కార్మిక సంఘాలకు, విద్యనేర్పక

పోవడం మనం కూర్చున్న కొమ్మలు మనం నరుక్కోవడం. అదేకాదు. జాతీయతా వృక్షాన్ని సమూలంగా తెగగొట్టడం సుమా!

62

వివాహం మతానికి అవరోధ మనుకోవద్దు. ఏది సత్యానందస్థితో, ఏది సత్యాత్మో గ్రహించు. ఆ విధంగా మానవుడు బ్రహ్మజ్ఞానకాంక్షతో సత్య బ్రహ్మానందాన్ని, పరమసత్యాన్ని, ప్రధాన సూత్రాన్ని, ధ్యానిస్తాడు.

63

భౌతిక సౌందర్యం; ముఖలావణ్యం, ఆకార సౌష్ఠవం చూచి చేసిన వైవాహికసంబంధాలన్నీ దుఃఖంతో అంత మవుతాయి.

64

భర్తయొక్క ఆదర్శం వివాహ బంధాన్ని ఉత్తేజితం చేసేటట్లు ఉండాలి. అంతేకాని డబ్బు సంపాదించడం, కుటుంబ బాంధవ్యాలను దుర్వినియోగం చేయడం కాదు.

# 2

# మతము - ధర్మాలు

అనువాదం.

**కేశవతీర్థులు**

# మతము - ధర్మాలు

1

ప్రాచీనమైనదికదా అని ఒకమతాన్ని అవలంబించవద్దు. దాని ప్రాచీనత సత్యానికి నిదర్శనం కాదు. ఒక్కొక్కప్పుడు పాతయింట్లు పడగొట్టడం, పాతదుస్తులు మార్చుకోవడమూ, అవసరం. నవీన దృక్పథం. కారణ పరీక్షకు నిలిచి అనుసరణీయమైనప్పుడు దాన్ని మంచు ముత్యాలతో మిలమిల లాడే గులాబిపూవులాగా స్వీకరించాలి.

2

నవీనమైంది కదా అని ఒకమతాన్ని స్వీకరించవద్దు. కాలపరీక్షకు ఆగని యీ మతాలు నవ్యత చేతనే ఉత్తమంకావు.

3

అనేకులు నమ్మారని ఒక మతాన్ని అవలంబించవద్దు. కారణం : జనబాహుళ్యం, సైతాను మతాన్ని (అజ్ఞానమార్గం) అనుసరిస్తుంది. దాని సత్యాన్నే అనేకులు ఒకప్పుడు విశ్వసించిన కాలం

ఉన్నది. అంతమాత్రాన బానిసత్వం అనుసరణీయమైన సంస్థకాదు.

4

ప్రత్యేకంగా కొందరే ఒక మతాన్ని అనుసరించడంవల్ల దాన్ని నమ్మవద్దు. ఆ కొద్దిమందే అంధకారంలో తప్పుదారి తొక్కివుండవచ్చు.

5

సర్వపరిత్యాగం చేసిన ఒక మహాతపస్వి నుండి వచ్చిన మతం కదా అని దాన్ని అవలంబించవద్దు కారణం: వాస్తవమైన మూఢత్వంతో సర్వసన్యాసంచేసిన అనేకమంది సత్యాన్ని గుర్తించకపోవడం మనం చూచాము.

6

రాజులచేత రాజాధిరాజులచేత ప్రబోధితమైనదని ఒక మతాన్ని అనుసరించవద్దు. తరచుగా రాజులు ఆధ్యాత్మికంగా దరిద్రులు.

7

ఒక మతం ఉన్నత పవిత్ర గ్రంథగతమైనదను

స్థాపించాడని" స్వీకరించవద్దు. కారణం: అనేక సమయాల్లో ఉన్నతశీలంగల మానవుడు సత్యాన్ని విశదీకరించడంలో తప్పిపోయినాడు.

ఒకడికి జీర్ణశక్తి అధికంగా ఉంటుంది. కానీ అతనికి జీర్ణక్రియావిధానం ఏమీ తెలియక పోవచ్చు.

ఒక చిత్రకారుడున్నాడు. మనోహరమైన చిత్రాలు గీస్తాడు. అయితే ప్రపంచంలోని అందరి కన్నా అతను అసహ్యంగా ఉండవచ్చు.

అనాకారు లనేకులున్నారు, అయినా వాండ్లే అఖండ సౌందర్య సత్యాలు బహిర్గతం చేస్తారు. 'సోక్రటీసు' అలాంటివాడు.

8

ఒక యశస్వి చెప్పిన మతం అని నమ్మవద్దు. సర్ ఐజాక్‌న్యూటన్ సుప్రసిద్ధుడు. కాని అతడి కాంతి ప్రసరణా సిద్ధాంతం తప్పు.

9

ఒకమతాన్ని దాని ఉత్తమత్వాన్ని బట్టే ఒప్పుకో. నీవే స్వయంగా దాన్ని పరీక్షించు! గాలించు!

10

నీ స్వేచ్ఛను, బుద్ధుడికి, జ్యూసెస్సుకూ, మహమ్మదుకూ, కృష్ణుడికీ, అమ్ముకోవద్దు.

11

కోటానుకోట్ల క్రీస్తులు ప్రపంచంలో జన్మించినప్పటికీ మిమ్మల్ని బాగుచేయలేరు. మీలో ఉన్న అంధకారాన్ని మీరే పోగొట్టుకోవాలి. ఇతరుల మీద ఆధారపడవద్దు.

12

మనలో ఉన్న అజ్ఞానాన్ని తొలగించి, ఆత్మను ఉద్దీపింపచేయడమే సర్వమతాలుచేసే ప్రయత్నం.

13

దేవుడిలో కంటే 'మంచి' లో నమ్మకం ఉంచడమే యథార్థమతం.

14

మరచిపోవద్దు! మతం. హృదయానికి సంబంధించింది. పుణ్యం హృత్సంబంధమైంది. అట్లాగే పాపము

కూడా. పాపమూ, పుణ్యమూ నిస్థితిని మనస్సును పట్టి ఉంటాయి.

15

వేదాంతశాస్త్రానికి అభిన్నమైన, మూఢశాస్త్రాల నుంచి విడదీయబడ్డమతం- అతిముఖ్యంగా ఒక రహస్యయోగం. ఆరహస్యయోగంద్వారా మనస్సు స్వస్థానానికి తిరిగి వెళ్ళి అక్కడ అతినిగూఢమైన పరమాత్మలో లీన మవుతుంది.

16

మతం మానవుణ్ణి స్వస్వరూప సంధానం చేస్తుంది.

17

ఆధునిక శాస్త్రపరిశోధనలతో సంబంధం పెట్టు కోనటువంటి మతంకానీ, వర్గంకానీ, మానవులను మూఢులను చేస్తుంది.

18

మూఢంగా చర్చిలల్లో సంఘాలల్లో చేరడమూ, క్రీస్తనీ, కృష్ణుడనీ, ఆదేవుణ్ణీ, యీ దేవుణ్ణీ, కొలవడం- దీనివల్ల లాభ మేమీ లేదు.

19

ప్రపంచంలోని నిర్హేతుకవాదాలన్నీ కొద్దో గొప్పో గుడ్డి నమ్మకాలతో కూడు కొన్నవే.

20

ప్రపంచంలోని సర్వమతమార్గాలు, అజ్ఞానపు తెరను తొలగించడానికి చేసే ప్రయత్నాలే.

21

ఈమతాలూ, మతవిధానాలు, అన్నిటినీ మనం రక్షరేకుల్లాగా మెళ్లో తగిలించుకుంటున్నాము. కానీ సత్యాన్ని తెలుసుకోవడం స్వేచ్ఛమీద ఆధారపడి వుంది కాని, కించిత్స్వప్నాలమీద ఆధారపడి ఉండలేదు.

22

ఆడంబరానికి చేసే ఉపకారాలు, శాసనాలు 'ఇదిచెయ్యి-ఇదివద్దు' అనే ఆజ్ఞలు ఉన్నంతవరకూ ఆధ్యాత్మిక వికాసానికి, నిజమైన పవిత్రతకూ తావు లేదు.

23

'ని విధిచెయ్యి' అని ఆజ్ఞాపించడం లోనే మన వ్యక్తిత్వం బంధింపబడుతున్నది. బంధం ఉన్నచోట ఆనందం లేదు. తరళత్వంవల్ల, మోహానురాగం వల్ల, అసూయవల్ల, గమ్యస్థానమైన 'నిర్వాణం' పొందలేము.

24

అమాయకులైన చిన్నపిల్లల నెత్తిమీద మత నమ్మకాలు రుద్దడంవల్లనే ఆధ్యాత్మిక దారిద్ర్యం ఏర్పడుతున్నది.

25

ఆధ్యాత్మిక దారిద్ర్యమూ, పరమత సహనం లేక పోవడమూ, ఒకవ్యాధియొక్క రెండు దశలు. మొదటిది స్తబ్ధ స్థితి. రెండోది తీవ్రస్థితి.

26

వ్యక్తులను, వారి బిరుదులనూ, సంపదలనూ, విద్యాధిక్యతను, స్థితిగతులను గౌరవించడం — 'విగ్రహారాధన' లాంటిది.

27

అనంతమైన, అమరమైన, పరమాత్మను కలుషితం చేస్తున్న వంటయింటి మతం- నిజంగా విచారకరం;

28

ఓం సంశయాకులిత చంచలమానసమా!

శ్రద్ధలేని శాస్త్రవిచారాలు, భిన్నభిన్నమతాలు, ఇంకవద్దు. సందేహాలను, సంకోచాలను, భస్మం చెయ్యి. ఈమతాలన్నీ నీకల్పనే.

29

భగవంతునిమీద, క్రీస్తుమీద, మహమ్మదు మీద, కృష్ణుడిమీద, ఋషులమీద, ఆధారపడి ఉన్నావని ఎందుకనుకుంటావు? నీవు స్వతంత్రుడివి. నీవే ప్రతివాడివి. నీవే అంతా!

30

రాముడు మీకోసం ఒక కొత్తమతం తెచ్చాడు. అది ప్రతిబజారులో కనుపిస్తుంది. ప్రతి ఆకుమీదా వ్రాయబడి వుంది. సెలయేటి మర్మర ధ్వానాలలో

వినబడుతూ వుంది. గాలిలో ఆ మతరహస్యమే విని పిస్తున్నది. మీ నరాల్లో, సంకల్పాల్లో పొంగిపోతున్నది. మీ వ్యాపారంలో వుంది. మీ హృదయానికి హత్తబడి వుంది. ఈ మతాన్ని అవలంబించాలంటే చర్చిలో అడుగుబెట్టనక్కరలేదు. నిత్యప్రాపంచిక జీవితంలో ఆచరించవచ్చు. మీసంసారంలోకికూడా యీమతం ప్రాకింది. సకలచరాచర జగత్తులో ఈ మతం విస్తరించింది.

31

వేదాంతమంటే మూలసత్యమని అర్థం. ఈ మూలసత్యం నిస్వార్థము. అది రాముడికెంతో నీకంతే. ఆ సత్యం సకలహిందువులకీ సమానంగా చెందుతుంది. అది ఎవనికీ చెందదు. ప్రతివాడూ, ప్రతివస్తువూ, దానికే చెందుతాయి.

32

విజయరహస్యం వేదాంతాన్ని అనుసరించడమే. అనుభవవేదాంతమే విజయరహస్యం.

33

"ఓ క్రైస్తవులారా! ఓ మహమ్మదీయులారా! ఓ వైష్ణవులారా! వివిధమతస్థుల్లారా! క్రీస్తు, బుద్ధుడు, కృష్ణుడు, లేక ఏ మహాత్ముని నామంచేత నైనా మీరు ఉద్ధరింపబడ్డారని అనుకున్నట్లయితే, ఆ సత్యగుణం క్రీస్తులో, బుద్ధుడిలో, కృష్ణుడిలో, ఎవరిలో లేదు. ఆ సత్యం నీ ఆత్మలో ఉన్నది." అంటుంది వేదాంతం.

34

"వ్యక్తుల భావాలకంటె సత్యంమీద ఎక్కువ గౌరవం ఉంచు; అట్లా సత్యం విలువను గుర్తిస్తే మిత్రుణ్ణిగూడా గౌరవిస్తున్నట్లు" అని వేదాంతం చెపుతుంది.

35

ఆత్మానుసంధానానికి వేదాంతం చూపించే మార్గం ఇది. "నీ దేహాన్ని పట్టుకొని వేళ్లాడ వద్దు. దేహం ఉన్నా పోయినా లెక్కచెయ్యవాకు. ప్రజలు నీ శరీరం మీద పూలుచల్లినా, రాలు రువ్వినా లెక్కచెయ్యవద్దు. వీటికి అతీతుడవుకా.

36

నీ దేహమెంత అనిత్యమో, ఇతర స్వరూపాలు కూడా అంత అనిత్యాలే. ఇది ధర్మం అంటుంది వేదాన్తం.

37

విగ్రహాన్ని విగ్రహం కోసం ప్రేమించవద్దు. విగ్రహంలో ఉన్న మనిషికోసం ప్రేమించు. అలా ప్రేమించకపోవడం మూఢారాధన.

38

విగ్రహారాధన అంటే ఏమిటి? శత్రులకూ మిత్రులకూ ఆకారవ్యక్తిత్వాలు కల్పించి, అఖండ సత్యాత్మనే, ధర్మాన్నే విస్మరిస్తాము-ఇదే విగ్రహారాధన.

39

ప్రతిమనిషిలో బ్రహ్మాంశం ఉంది. దివ్యమణి ఉంది. బ్రహ్మధనం ఉన్నది. ప్రతివాడూ భగవంతుడే.

40

అగాధమైన ఉపనిషద్బోధలకూ, బ్రహ్మాండమైన

వేదాంతానికి, బదులు, వంటయింటి మతం వచ్చింది. ఆహారవిషయాల్లో విపరీతాభిమానం పెరిగింది.

41

వేదాంతసత్యం, ఒక్క వేదబద్ధమైనదే కాదు. అది మీ హృదయాల్లో వుంది. రాముడు ఒకమతానికి, సిద్ధాంతానికి, దాసుడుకాడు. రాముడు మీ ఆత్మే! అతనే స్వేచ్ఛ!

42

బ్రహ్మవిద్యను దాచవద్దు. అజ్ఞానము, బలహీనతా, అనే చీకటి గదులను పడకొట్టు. దివ్యకాంతిని ప్రసరించు. బ్రాహ్మమారుతాన్ని వీచు.

43

వేదాంతం నీ కోరికలను చంపి, నిన్ను దుఃఖమయంగా చెయ్యదు. వేదాంతం కోరికలను నీవశం చేస్తుంది. వేదాంతంవల్ల కోరికలకు నీవు దాసుడివి కాక, కోరికలకు నీవు ప్రభు వౌతావు.

44

ఉపవాసం, ఒకయోగసాధనమాత్రమే-బలవం

తంగా ఉపవాసం చెయ్యవద్దు. బలవంతమైన దీక్ష వల్ల, దీక్షకు భానిసవు కావడం జరుగుతుంది.

45

నిజమైన ఉపవాసమంటే స్వార్థవాంఛల నుంచి విముక్తి కోరికలను పోషించి, పెంచుకోవడంకాదు.

46

'దాతృత్వం' దాని ఉద్దేశ్యంచేత నిర్ణయంకాదు దాని ఫలితాలవల్లనే నిర్ణయింప బడాలి.

47

మనం వేలకొలది బీదవాండ్లకు ఒక రోజు తిండి పెడితేనేమి, పెట్టకుంటేనేమి? ఈ వివేచన లేని దానం ఇంకా సోమరిపోతులను పెంచుతుంది.

48

'యజ్ఞం పాపాన్ని పరిహరిస్తుంది' అనే పూర్వుల వాక్యం ఇప్పటికీ నిజమే. యజ్ఞమంటే నోరులేని జీవజంతువులను బలిదీయడంకాదు. కక్షలు, కుల వైషమ్యాలు, అసూయ, పేరిమ, బలిపీఠంమీద బలి చేయడమే. దానివల్ల ప్రపంచంలోకి స్వర్గం దిగి వస్తుంది.

49

'పావనానికి' కృతిప యజ్ఞాగ్నుల రగిల్చే బదులు ఉజ్జ్వల ఉదయ సంధ్యారాగాల్లో ధర్మ నిష్ఠాపరుడైన యువకుణ్ణు, అహంకారాన్ని ఆహుతి చెయ్యాలె.

50

నిజమైన దేవతాయజ్ఞం అంటే సర్వప్రకృతి శక్తులకు, వ్యక్తుల సర్వశక్తులను అంకితం చెయ్యడం.

51

ఆదిత్య యజ్ఞ మంటే అందరి నేత్రాల్లో భగవంతుణ్ణి దర్శించడం. అందరి నేత్రాలను గౌరవించడం.

52

ఇంద్రియజ్ఞమంటే దేశాభ్యున్నతికి కృషి చేయడమే.

53

నీవు మానవుణ్ణి మానవుడిగా కాకుండా దివ్యుని నిగా దర్శించగలిగితే, మానవుణ్ణి పూజించగలిగితే,

ప్రతివస్తువులో దేవుణ్ణి, దివ్యత్వాన్ని చూచి, ఆరాధించగలిగితే, భగవంతుణ్ణి పూజిస్తున్నట్లే.

54

జగత్తులో ప్రతిఅణువూ మార్పు జెందవలసిందే. దేశ నైసర్గిక స్వరూపమూ మారింది. ప్రభుత్వమూ మారింది. వేషభాషలు మారాయి. ఇంకా వేద యుగపు దేవతలు, మనస్మృతి కలిసిమెలసి కాలంతో పాటు రాకుండా, ఆకాశంలో నక్షత్రాలు లాగుతూ ఉండటం దేనికి?

55

పరిస్థితులు మారాయి. ప్రజాబాహుళ్యానికి సామ్రాజ్యతత్వం మీద విముఖత కలిగింది. స్వయం పరిపాలనం కోరుతున్నారు. పురాతన ప్రవాధక్యతా సిద్ధాంతం 'అహం బ్రహ్మాస్మి' అనే స్వతంత్ర దృక్పథంలోకి మారవలసిన సమయం వచ్చింది.

56

ఆధునిక కర్మకాండ యాంత్రిక స్వరూపం ధరించింది.

కళలు పరిశ్రమలు బహుముఖంగా అభివృద్ధి చెందుతున్న యీ నవీనయుగంలో నీవు జీవించ దలచుకుంటే, ఒక్క రాజకీయాల్లోనే మునిగి తేల కుండా, విద్యుత్తేజంలోని 'మాతరిశ్వుణ్ణి', ఆవిరిలోని జలాధి దేవత 'వరుణుణ్ణి', కృషిశాస్త్రం మూలవతి 'కుబేరుణ్ణి' నీవశం చేసుకో!

ఈ శాస్త్రాలనూ కళలనూ పరిచయం చేసి వాటిని నీకు బోధిస్తున్న శాస్త్రజ్ఞులు, కళాకారులు ఈనవీన యజ్ఞానికి పురోహితులు.

57

సత్త్వైక నిష్ఠుడవైన నీవు చాలమంది వ్యతి రేకంగా ఉన్నారని భయపడ వద్దు.

58

జనం నిన్ను పొగడితే నీకే చెడు; ఎందుకంటే కపటమత ప్రవక్తలను వాండ్ల సమకాలీకులు అలాగే పొగడారు.

59

ఓ అవిశ్వాసీ! మేలుకో! నీ దివ్యచక్రవర్తిత్వాన్ని

గుర్తించు. నీవు దివ్యమైన చక్రవర్తిత్వాన్ని పొంది నప్పుడు, నీభ్రూచాలనం మాత్రం చేతనే, క్షుద్రమైన, ఘోరమైన నరకాలు, అద్భుతమైన స్వర్గాలవుతాయి.

౬౦

హృదయంలో విశ్వాసజ్వాలను, జ్ఞానజ్యోతిని వెలిగించకుండా నీవు, ఏ పనీ చేయలేవు. ఒక్క అడుగూ ముందుకు వేయలేవు.

61

పతితులను రక్షించడానిక నీవెవరు? నిన్ను నీవు రక్షించుకున్నావా?

62

కర్మకాండల వల్లనే మోక్షం లేదు.

63

నీలో స్వర్గరాజ్యం ఉంది. అందులో బ్రదుకు. నీవే స్వర్గరాజ్యానివి. జగత్తన్న వస్తువంతా నీదే.

64

మహాప్రభువైన నీసత్యాత్మ అనే క్రీస్తును, ఈ ప్రాపంచకమిథ్యాభోగాలకు విక్రయించవద్దు.

65

క్రీస్తును అట్లా కపటంగా ముద్దుపెట్టుకున్న తరువాత సంభవించిన విషాదసంఘటనే లేకపోతే, ఇప్పటికీ క్రీస్తుపేరు ఎవరు జ్ఞాపకం పెట్టుకుంటారు?

66

కావాలంటే క్రీస్తు నిప్పుడు సృష్టించవచ్చు.

67

ఆ బైబిల్లో దేవుడు, పాపం 'ఆదంకు ఈ డెన్ స్వర్గవనంలో 'ఆ చెట్టుపండునే' తినవద్దని నిర్దేశించక పోతే దాన్ని తిందామని అనుకొనేవాడే కాదు.

68

భార్యాభర్తలు పరస్పరం 'క్రీస్తులు' (రక్షకులు) కాకపోతే, బైబిలు గ్రంథాలు ఏమీచేయలేవు.

69

'మోసెస్' పరిధానధర్మం: 'నీకు 'ప్రేమ' కంటె ఇతర దైవం ఉండకూడదు' అని.

70

''బ్రహ్మ సత్యం జగన్మిథ్య: లా ఇల్లా ఇల్లల్లా!''

71

ప్రార్థన అంటే ఏవో మాటలు జపించడం కాదు. పరితపించడం; దివ్యత్వాన్ని తెలుసుకో వడమే ప్రార్థన.

72

'ఓ ప్రభూ! నీ ఇచ్ఛ నెరవేరుతుంది' అని ప్రార్థించడానికి బదులు 'నా ఇచ్ఛ నిర్వర్తింపబడు తుంది- నా ఇచ్ఛ నిర్వర్తింపబడుతుంది - అని ఆనందించు!

73

ఇతర్ల అభిప్రాయాలచేత మోహితుడవు కావాకు. ఈ పరాభిప్రాయాలకు లోబడే బల హీనత్వానికి ఎంత దూరంగా ఉంటే వానికంత స్వేచ్ఛ.

74

నిజానికి చర్చిలు, గుళ్లూ, సంఘాలు, సభలు, జగదజ్ఞాన నిద్రను ఎక్కువచేసే వివిధోపకరణాలు.

75

సత్యానికి ప్రమాణం కావాలా?

సూర్యుణ్ణి చూడడానికి వేరే దీపం ఎందుకు? ఒక చిన్న గణితసూత్రాన్ని ఋజువు చేయడానికి క్రీస్తు, మహమ్మదు, బుద్ధుడు, జొరాస్ట్రియు, వేదాలు - ఇలాంటి ప్రమాణాలు అవసరం లేదు.

76

ప్రేరిస్తున్న సత్య 'ప్రేమే' స్ఫూర్తై జీవించడం మంచిది. ఈ బుద్ధుళ్ళు, క్రీస్తులు, స్వాములు, ఇలాంటి గతించిన వాళ్ళ అసంపూర్ణ దృష్టాంతరాలు తీసుకోవాకు.

77

ఈ ఇరవయ్యో శతాబ్దం వివేకవంతులుం కావడానికి, మతబోధలతో వ్యక్తిత్వాలు కల్పకుండా ఉండానికి, తగినసమయం. బురదలోపుట్టినదని మనోహరమైన తామరపుష్పం వదలేస్తామా ?

78

వాటి సుగుణాలనుబట్టే, ఒకని ఉపదేశాలు, ...

లాలు, మనంస్వీకరించాలె. బోధకునివ్యక్తిత్వాన్ని మనం చూడకూడదు. యూక్లిడ్ వ్యక్తిత్వానికి 'రేఖాశాస్త్ర సూత్రాలకు' సంబంధం ఏముంది?

79

దాస్య శృంఖలాలు సడలిపోతున్నాయి. మార్పు వస్తున్నది. ప్రతిదీ ముందుకు పోవాలి. నీ ప్రత్యేకమైన వ్యక్తి దైవం మాత్రం ఎందుకు అట్లా స్థిరంగా ఉండాలె? మారాలి.

80

భౌతికవాదం, * సంశయవాదం, దృశ్యవాదం, నాస్తికవాదం- వీటిని ప్రతిపాదించిన వాండ్లే గెలుపుకు కారణం, వాండ్లకు తెలియకుండానే వాండ్లలో ఉన్న మతచైతన్యమే.

* Pyrrhonism (Doctrine that certainty of knowledge is unattainable Septism, Agnosticism,- ఈ వాదాలన్నీ సత్యజ్ఞానపు పూర్ణత్వాన్ని పొందలేమని శంకించే వాదాలు. అవే సంశయ వాదాలు.

సంపా.

81

నైజంగా ఈజగత్తే ఒక విచిత్రం. వేరే అద్భుతాలవసరం లేదు. ఆత్మజ్ఞానంచేతనే అన్ని పాపాలకు మూలమైన భయం నశిస్తుంది. పవిత్రాన్ని తెలుసుకొని పవిత్రులుకాండి. ఇంతకన్న వినా యితర మతాన్ని బోధించడం కృత్రిమం.

82

నీజీవితం - నీవు జీవించకుండా ఇతరులకు వదలిపెట్టడం సోమరితనంకాదా ? గుడ్డలు వేసుకోడానికి, తినడానికి, నడవడానికి, నిద్రపోడానికి, నవ్వడానికి, ఏ విషయం మాట్లాడడానికి, చివరకు ఏడవడానికి కూడా- నీకు స్వేచ్ఛ లేదు.

83

ఇతరులదృష్టిలో మంచిగా కనపడడానికి మనం కోరుతాం. ఇదే సాంఘిక దురాచారం. అన్ని మతాల్లో వున్న దోషం.

84

స్మృతి చిహ్నాలైన విగ్రహాలన్నీ, 'నిన్న

మేము ఇట్లా చేద్దామనుకున్నాము. నువ్వు ఈ విషయం ఎట్లా ఆలోచిస్తున్నావు?" అని ఆత్రగ డానికి నిల్చి వున్నాయి.

౮౫

ఒక మత గ్రంథం ప్రజలకు ఆధ్యాత్మిక వాంఛలు తీర్చకపోతే, అది జీవించదు. ప్రజలు పొందుతూ వున్న పరిణామాలకు అనుగుణ్యంగా వాంఛితమత గ్రంథాల వ్యాఖ్యలూ అభివృద్ధి చెందాలి.

౮౬

మన సమస్యలు మనమే పరిష్కరించుకోవాలె. గతించిన పూజ్యులైన మనపూర్వఋషుల దృష్టితో తొంగిచూడడం మాని, మన కండ్లతో మనం చూడాలి.

౮౭

ప్రకృతిలో ప్రకృతిని భగవంతునిగా దర్శించడమే కాదు. ఆ భగవంతుణ్ణి శాస్త్ర పరిశోధనాలయాలలోనూ దర్శించు. రసాయనిక శాస్త్రజ్ఞుని (పరిశోధనా) స్థానాన్ని పవిత్ర యజ్ఞకుండంగా గ్రహించు.

౮౮

బహిః ప్రకృతియొక్క ఆత్మ నీ అంతరాత్మకు భిన్నమైనప్పుడు, నీవు నాశనం కావలసిందే.

౮౯

సాయం సూర్యాభి ముఖంగానైనా, ఉదయ సూర్యాభి ముఖంగా నైనా చదువు. నదీతీరాల్లో, మలయానిల మార్గాల్లో, గమనించు. ప్రకృతిగానంలో శ్రుతిగల్పి విశ్వైక్యం పొందుతావు.

90

వార్తాపత్రికలు చదవనివాండ్లే అదృష్టవంతులు. వాండ్లే ప్రకృతి సౌందర్యాన్ని, ప్రకృతిద్వారా భగవంతుణ్ణి సందర్శిస్తారు.

91

అన్నం తినడంకూడా (శాస్త్రం, జ్ఞానం) జ్ఞానం ఉపదేశించాలె.

92

ప్రపంచంలోని పవిత్రమైన మతగ్రంథాలన్ని

శసాయనికశాస్త్రం చదివినట్లే చదవాలి. మన అనుభవాలే మనకు ప్రమాణం.

93

శాస్త్రాన్ని వ్యాపింపచేయడంలోని ఉద్దేశ్యం మతంలోని కొన్నికొన్ని అపార్థాలను తొలగించి పరిజాశక్తులను వివేకవంతమైన, సహజమైన సహేతుకమైన పథంలో పెట్టడమే!

94

భూత భవిష్యత్తుల సమన్వయపరచడానికి బైబుల్లో, భాష్యాలూ, వ్యాఖ్యానాల్లాంటి ఇతర మతగ్రంథాల్లో, వున్న హేతురహిత విషయాలు శాస్త్రపరిశోధనాలతో అనుసంధింపవచ్చునా?

95

పవిత్రమైన ఓంకార సత్యానికి వ్యతిరేకిస్తే శాస్త్రంకూడా నిరర్థకం.

96

శాస్త్రం వేదాలకు వ్యతిరేకంగా లేదు. ఆధునిక

శాస్త్రపరిశోధన లన్నీ మస్తిష్కానికి శాఖ్య కడుగుతున్నాయి- వేదాంతానికి దోహదం చేస్తున్నాయి.

97

మనిషి స్నానం చేసేటప్పుడు ఎన్ని సార్లు మునగాలి? ఇలాంటి అనవసరమైన సమస్యలను చర్చించడంలో, చాలామంది యువకుల మానసిక శక్తులు, వృథావ్యయం చేయబడుతున్నాయి.

98

నీ మనస్సును ఉన్నత విషయాలకు మరల్చు. అప్పుడు నీకు ఇంద్రియ సుఖాభిలాషకు అవకాశ ముండదు.

99

మతానికి ప్రాపంచిక ప్రేమతో ఏసంబంధమూ లేదని మామూలుగా చెప్పబడుతుంది. కాని రాముడు ఉన్నదంటాడు. ప్రేమను సద్వినియోగం చేయడం వల్ల భగవంతుణ్ణి తెలుసుకుంటావు.

100

భార్యాభర్తలు పరస్పర క్షేమాన్ని కోరుకోంటే

మతం వృద్ధి పొందడానికి ఏమాత్రం అవకాశం ఉండదు.

101

నిజంగా మనుష్యుడికి ఇంద్రియ సుఖాల సారాంశం కూడా తెలిసేది. కాని దీని ద్వారా మతాన్ని చూడడం మురికి నిండిపోయిన గవాక్షంలోనుంచి రాజదర్బారు చూడడం వంటిది.

102

మన నివేదనలకూ, ఉపచారాలకూ, దేవతలు నవ్వుతారు. భగవంతుడిమీద విశ్వాసంతో ఉండాలని మనం ఎంత హాస్యాస్పదమైన, అపరిమాణమైన, నేరాలు చేస్తున్నాం?

103

బెదరింపులూ, శిక్షలు - పాపాన్ని నిరోధించలేక పోయినై.

104

మాతృహత్య, నరహత్య - ఇలాంటివి నేరాలకు

వేర్లు. అయితే సర్వుల్లో ఉన్న దైవత్వాన్ని గుర్తించక పోవడం దైవహత్యా; నేరం చేయడం.

105

ఊరక నీతిసూత్రాలు చెప్పడంవల్ల నైతిక దారిద్ర్యం ఏర్పడుతుంది.

106

ధర్మాలు, నీతి సూత్రాలే సమస్యలను పరిష్కరిస్తాయని ప్రపంచం అనుకుంటుంది. చాలా మతాలు నమ్ముతాయి. అనేకమంది నీతిబోధకులు వాదిస్తారు. ఇది వట్టి అబద్ధం! అసత్యం!

107

కొన్ని సమయాల్లో మోహాన్ని 'ప్రేమ' అనుకున్నట్లు 'నైతిక బలహీనత' పవిత్రతగా పిలువబడుతుంది.

108

హృదయ పవిత్రత అంటే, దాంపత్యదోషాలు విసర్జించడం మాత్రమే కాదు; ఇంకా దానికి చాలా అర్థం ఉన్నది.

## 109

నీ ఆత్మ ప్రకృతితః అపవిత్రం కాదు. పాప పూరితం కాదు. అది ఒకడి పాపంవల్ల పతనం కాలేదు. రక్షణకోసం ఇంకొకడి పుణ్యంమీద ఆధారపడదు.

## 110

ప్రజలు నిను వ్యతిరేకించినా, కష్టాలుపెట్టినా, దూషించినా వారి ఆగ్రహానుగ్రహాలు, వాగ్దానాలు, బెదరింపులూ లెక్కచెయ్యవొదు. నీ మానస సరో వరంనుంచి, అనంత దివ్యస్వచ్ఛజలాలు ప్రవహిం చనీ, అప్పుడప్పు డూరే చెలమలో పరిశుద్ధ జలం త్రాగేవాండ్లకు హానిచేయలేవు. అలాగే నీలో కల్మ షానికి చోటులేకుండా అమృతం పొంగిపోనీ.

## 111

మూలమూలల్లో, వీథివీథుల్లో చాటాలసిన ద్వైవ ధర్మం ఒకటి ఉంది, భగవంతుడి కండ్లలో దుమ్ము కొట్టడానికి ప్రయత్నిస్తే నీవే గుడ్డివాడ వవుతావు.

112

ఏకాంతగృహాల్లో నీవొక పాపం చేస్తావు. వెంటనే నీపాదాలక్రింది తృణమే నీకు వ్యతిరేకంగా సాక్ష్యం నిలువబడడం చూచి ఆశ్చర్య పడతావు. ఆ అనుక్షణమే, గోడలకు వృక్షాలకు నాలుకలు వస్తాయి. మాట్లాడుతాయి. నీవు ప్రకృతిని, పరమేశ్వరుడిని మోసం చేయలేవు. ఇది నిజం. ఇది ధర్మం.

113

భగవదాకర్షణశక్తిని ఎదుర్కోవాదు. జాగ్రత్తగా నడువు. నీవు పడిపోవు. నీ పతనాలన్నిటికీ, అపాయాలకూ, దెబ్బలకూ, వ్యాకులాలకూ, కష్టాలకూ కారణం నీలో ఉండే ఏదో బలహీనతే. దాన్ని పోగొట్టు.

114

ప్రకృతిలో ఉండే మంచికి నీ హృదయం ఎంత ప్రతిస్పందిస్తే, అంతగా ప్రకృతిసర్వంలో జీవిస్తున్నది నీవే అని గుర్తిస్తావు.

## 115

ఇతర్ల విషయంలో నీకున్న బాధ్యత ఏమిటి? ఇతర్లు జబ్బుపడితే నీ చెంతకు తెచ్చుకో. నీ దేహానికి గాయం తగిలితే ఎంత శ్రద్ధ తీసుకుంటావో, ఇతర్ల గాయాలు కూడా నీ స్వంత దేహానివే అనుకో. సేవించు.

## 116

నీవు ఒక విషయం అనుభవించడానికి ప్రారంభిస్తావు. వెంటనే నీ పొరుగువాడు కూడా ఆ భావానికి ప్రతిస్పందిస్తాడు.

## 117

తోటి మానవుణ్ణి ద్వేషించేవాడు నరహంతకుడు.

## 118

నీ ఆత్మ, పొరుగువాడి ఆత్మ ఒకటేనని గుర్తించకపోవడం పరమ పవిత్ర సత్యాన్ని ఉల్లంఘించడం.

ఓం. ఓం. ఓం.

# 3

# తత్త్వజ్ఞానం

అనువాదం.

ఏల్చూరి సుబ్రహ్మణ్యం

# తత్త్వజ్ఞానం

1

ప్రకృతిరహస్యాలను వివరించలేని తత్త్వం ఏదైనాసరే, అది తత్త్వం కాదు.

2

'సత్యం' అంటే ఏమిటి? 'తత్త్వమసీ', 'ప్రేమ'.

3

సత్యానికి రాజీ అక్కరలేదు. ప్రపంచం సూర్యుడుచుట్టు గిరగిరా తిరగాలసిందే. సూర్యుడు ప్రపంచంచుట్టూ తిరగ నవసరంలేదు.

4

సత్యం ఒకవ్యక్తి ఆస్తికాదు. సత్యం జీసస్ ఆస్తి కాదు. దాన్ని జీసస్ పేరట మాత్రం బోధించ నవసరం లేదు. అట్లాగే దాన్ని కృష్ణుడి పేరటా బోధించ నవసరంలేదు. అది ఒకరిదికాదు. సత్యం అందరికీ చెందిందే!

5

'నిన్నా, ఇవ్వాళ్ళా, రేపూ, ఎప్పుడూ ఒకే

రకంగా ఉండేది సత్యం.' ఆ సత్యాన్ని ఏదో ఒక సంఘటన చూళ్ళి, వేరుగా భ్రమించవద్దు.

6

సత్యాన్ని గుర్తించడం, విశ్వానికి అధినేతవు కావడమే !

7

సత్యాన్ని గుర్తించడానికి, దివ్యత్వం తెలుసుకోడానికి, నీ ప్రియమైన కోర్కెలనూ, నీ ప్రేమాస్పదులనూ, నీ మూఢ విశ్వాసాలను వదలుకోవాలి. వాటిని సంపూర్ణంగా ఛేదించాలి. దేహంలోనుంచి వాటిని పారద్రోలాలి.

8

సత్యంకోసం దేహం వదలుకోవలసి వస్తే వదలుకో! దానితో ఈ చిట్టచివర బంధంకూడా పటాపంచలయినట్లే.

9

సత్యాన్ని లేక భగవంతుణ్ణి- నీతల్లిగా చేసుకో! నీతండ్రిగా చేసుకో! నీ భార్యగా చేసుకో! నీ పిత

మనిషినిగా చేసుకో! నీ గురువుగా చేసుకో! నీ ఆస్తిగా చేసుకో! నీ ఇల్లుగా చేసుకో! నీ సర్వస్వంగా చేసుకో!

10

సత్యం- మానవుణ్ణి, సకల బ్రహ్మాండానికి అధినాయకుణ్ణి చేస్తుంది.

11

చచ్చిపోయిన తర్వాత నీవు నరకానికి వెళ్ళడం, లేక స్వర్గానికి వెళ్ళడం సంపూర్ణంగా సత్యం కాదు.

12

పూర్ణమైన మానవుణ్ణి చూడడం అరుదు. పరిపూర్ణత్వంపొందిన మానవుడు ఈశ్వర ప్రేరితుడు- అతనే సత్యం. నీవూ పరిపూర్ణుడివికా! కోర్కెల నుండి విముక్తి పొందు. బంధాలు తెంచేసుకో; రాగద్వేషాలనుంచి తప్పించుకో!

13

నిజానికి 'పరమాత్మ' ఒక్కటే ఉన్నది. అది తప్ప మరి ఒకటి లేదు. అది తప్ప మరిఒకటి లేకపోవడం

చేత నీవు దాంట్లో ఒక భాగం అవడానికి వీలు లేదు. నీవే ఆ పరమాత్మవు. సత్యంలో భాగాలు లేవు. నీవే ఇప్పుడు సత్యానివి.

14

పరిజలూ, వస్తువులూ, అన్నీ మనకు పనికివచ్చి నంతవరకూ ప్రియంగానే వుంటై. అవి మనకు ఏ క్షణాన్నైతే ఉపయోగపడవో ఆ క్షణంలోనే వాటిని త్యజిస్తాము.

15

బిడ్డను ప్రేమించడం బిడ్డకోసం కాదు- ఆత్మకోసం; భార్యను ప్రేమించడం భార్యకోసం కాదు- ఆత్మకోసం; భర్తనూ భర్తకోసం కాదు ప్రేమించేది; ఆత్మకోసం - ఇదే సత్యం.

16

చావును గురించి అంతా తెలిసినప్పటికీ ప్రజలకు చావులో దేనికి విశ్వాసం లేదు? వేదాంతం ఇట్లా వివరిస్తుంది. "మానవుల్లో సత్యాత్మ వుంది. అది మారదనికీ, నాశనం లేదనికీ. నిన్న ఎట్లా వుందో

ఇవ్వాళ అట్లాగే వుంటుంది. ఇవ్వాళ వున్నట్టే రేపూ; రేపటిలాగే- ఎప్పుడూ. చావును తిరస్కరించేదీ, చావు లేనిదీ- చావూ, మార్పూ లేని- ఆత్మ మానవుడిలో వుంది.”

17

‘నేను పురుషు’ణ్ణని గానీ, ‘నేను స్త్రీ’నని గానీ, ‘ఒక్క ప్రాణికే పురు’గని గానీ చెప్పుకోవడం అసత్యం. అది నాస్తికత్వం.

18

మనస్సుకు అతీతమైందీ, కంటికి అగోచరమైందీ, ఇంద్రియాలకు అందనదీ; ఇంద్రియాలకూ, మనస్సుకూ, కంటికీ చైతన్యం ఇచ్చేది- బ్రహ్మపదార్థం.

19

శాంతిలేని ఓ నాస్తికుడా! కోపంగా చిరాకుగా చిటిక్లిస్తూ వుంటా వెందుకు? నీలోని మధురమైన దివ్యాత్మ- ఒక్క-టే విశ్వాన్ని నిరంకుశంగా పరిపాలించ గలదు.

20

ఎవరు నీవు ?

అనంతమైన, నిర్మలమైన, శాశ్వతమైన పర మాత్మవు.

21

నీ దివ్యాత్మనే నీవు సంశయిస్తున్నావా? నీ హృదయంలో ఆ సంశయం కంటే ఒక తుపాకిగుండు పెట్టుకోవడం మంచిది.

22

* పరబ్రహ్మ సత్యం-ప్రపంచమూ, దృశ్యమూ అంతా మాయ.

23

దేహం నీడవంటిది. సత్యాత్మ ఒక్కటే సత్యం; యదార్థం.

24

నిజమైన మానవుడే ఈశ్వరుడు.

25

భగవంతుడు మాటలకూ, మనస్సుకు అందని వాడు.

---

* బ్రహ్మసత్యం జగన్మిథ్య. సం॥ పా.

26

పరబ్రహ్మ దృష్టికీ, బుద్ధికీ అతీతుడు. మనస్సూ, మాటలూ నిరాశతో అక్కడ వెనకడుగు వెయ్యాల్సిందే.

27

నీవు గాఢనిద్రలో ఉన్నప్పటికీ, నీలో మేల్కొని వుండేది ఒకటి ఉంది. అదే సత్యాత్మ; అదే నీలోని చైతన్యం.

28

నీవు భగవంతుడిలో ఒక భాగమేనా? అని ప్రజలు నిన్ను అడుగుతారు. నీవు భగవంతుడిలో ఒక భాగం కానేకాదు! భగవంతుణ్ణి అట్లా ప్రత్యేకించడానికి వీలు లేదు. పరమాత్మ అనంతమైంది కాబట్టి, నీవూ అనంతత్వానివే అవుతున్నావు. భగవంతుడిలో నీవు ఒకభాగం కాదు.

29

ప్రశ్న:—దేవుడిలో నీకు నమ్మకం వుందా?

జవాబు:—"భగవంతుణ్ణి తెలుసుకున్నాను."

29

మనం ఒకవిషయాన్ని తెలుసుకొనేప్పుడే దాన్ని నమ్ముతాము. అదీ బలవంతంగా నమ్మవలసివస్తుంది. దేవుణ్ణి నమ్మడం అనడంలో అర్థంలేదు. దేవుణ్ణి గురించి నీ కేం తెలుసు? నేను భగవంతుణ్ణి తెలుసుకున్నాను. నేనే అతను- అతను నేనే!

30

ఎక్కడయితే మరే ఇతరాన్ని దర్శించలేరో, మరేదిన్నీ అర్థంచేసుకోలేరో, మరిదేన్నీ వినలేరో- అక్కడే అనంతత్వం వుంది. ఎక్కడైతే మరేఇతరం వున్నా, ఆ అధికారం స్వల్పం అవుతున్నది.

31

అనంతత్వమే బ్రహ్మానందము. హద్దు కల దాంట్లో ఆనందం లేదు. నీ స్థితి పరిమితమైనకొద్దీ, నీకు బ్రహ్మానందం లభ్యం కాదు. నీకు ఆనందమే వుండదు. అనంతత్వమే బ్రహ్మానందం.

32

నీ దగ్గరకు ఎవరు వచ్చినా, అతన్ని దేవుని లాగా ఆహ్వానించు. కానీ నీ వ్యక్తిత్వానికి భంగం

కలిగించుకోవద్దు. ఇవ్వాళ్ళ నీవు ఖైదీవైనా, ఆనంద మయుడవ వవుతావు.

33

నీలోనే వుంది సచ్చిదానందం. నీలో దివ్యామృత మహార్ణవం వుంది. నీలో నీవు వెతుక్కో! గుర్తించు! అదే నీలోని ఆత్మ. అది శరీరమూ కాదు. మనస్సూ కాదు. బుద్ధీ కాదు. కోరికకూడా కాదు. కోరికలను కోరేదీ కాదు. అది కోరబడేదీ కాదు. వాటి కన్నిటికీ అతీతుడివి నీవు. కోర్కెలు, మనస్సూ చిన్న దృశ్యాలాంటివి. నీవు వికసించిన పుష్పం లాగా, తళతళలాడే చుక్కలాగా, మెరుస్తావు. నీవు కోరవలసింది ప్రపంచంలో ఏముంది?

34

నీ దృష్టి బాహ్యవిషయాలపై కేంద్రీకరించి, వాటిని గ్రహించుకోవా లనుకుంటే, అవి నీ దృష్టికి అందకుండా పరుగెత్తుతై. నీవు వాటికి ఎప్పుడు విముఖుడ వౌతావో, నీలోని దివ్య తేజస్సునూ ఆత్మనూ, దర్శిస్తావో- అప్పుడే నీకు అనుకూల వాతావరణం ఏర్పడుతుంది. ఇది విజయసూత్రం.

35

ఎప్పుడైతే ఒకడు ప్రాపంచక విషయాల్లో లోలుడౌతాడో ఎప్పుడైతే ఒకడు ఒక వస్తువును దానికోసం ప్రేమిస్తాడో, దానిలోనే ఆనందాన్ని పొందాలను కుంటాడో, అప్పుడే మోసపోతాడు. అతని ఇంద్రియాలే అతన్ని మోసగిస్తై. నీకు ప్రాపంచక విషయాల్లో మమత వదలనంతవరకూ ఆనందాన్ని పొందలేవు. ఇది వైదాంతిక శాసనం.

36

(ధన) అర్థబలాన్ని విశ్వసించవద్దు! భగవంతుణ్ణి విశ్వసించు! దీన్నీ దాన్నీ విశ్వసించక, ఒక్క ఈశ్వరుణ్ణి విశ్వసించు! నీ ఆత్మనే నీవు విశ్వసించు!

37

విఫలుడివి కావద్దు! గర్వించవద్దు! నీ అహంకారం చేత ఏదైనా సరే నీదని అనుకోవద్దు! అన్నీ సత్యాత్మవే. అన్నీ ఈశ్వరుడివే.

38

నీ దేహానికి అతీతుడివికా! నీవు అనంతుడవని

తెలుసుకో! పరమాత్మ వన్నసంగతి గుర్తించు. మోహబంధాలూ, కోర్కెలూ, నిన్ను ఏంచేస్తాయి?

39

దైవత్వంలో జీవించు. నీవు స్వతంత్రుడివి. నీకు నీవే రాజువు. విశ్వానికి నీవే అధినేతవు.

40

ఎప్పుడైతే ఒకడు విశ్వాత్మను తన ఆత్మగా భావిస్తాడో, అప్పుడే ఈ విశ్వం అతని శరీరం అవుతుంది.

41

ఆకలీ, దప్పిక- దేహానికీ, మనస్సుకేగాని, ఆత్మకు లేవు. అవి ఆత్మను బాధించవు. ఎవరు తనలోని దివ్యత్వాన్ని, ఈశ్వరుణ్ణి గుర్తిస్తాడో- ఆకలీ, దప్పిక, అలసటా అతన్ని కలతపెట్టలేవు.

42

మనశ్శాంతిని సాధించుకో. నిర్మలమైన భావాలు కలిగి వుండు. ఎవ్వరూ నీకు ఎదురుగా నిల్చోలేరు. ఇది ఒక ధర్మం.

43

అసలు ధర్మం ఏమిటంటే, మానవుడు నిశ్చలంగా ప్రశాంతంగా ఉండాలి. దేహం తీవ్రంగా పనిచేస్తుండాలి. బుద్ధి స్థావరధర్మాన్ని, శరీరం గమనధర్మాన్ని అనుసరించాలి. అంతరాత్మ నిశ్చలంగా ఉండాలి. ఇదే అసలు ధర్మం. స్వతంత్రుడివికా. బంధాలు తెంచుకో!

44

మనలోని 'నేను నే నశ్వరమైన అహంభావాన్ని దూరం చెయ్యాలి. అదే మనలోనూ, ఇతరులలోనూ, పాపాన్ని పెంచుతుంది.

45

పవిత్రత, నిజానికి సత్యాత్మకే సంబంధించింది. కానీ, ఆచరణలో పవిత్రత దైహికమైందని అసత్యారోపణ చేస్తాము.

46

'నీవే దివ్యత్వానివి. పవిత్రులలో పవిత్రుడివి. ఈ ప్రపంచం నిజంకాదు. నీవే సర్వవ్యాపకుడవు.

సర్వేశ్వరుడవు. నిర్మలుడవు నీవే. నిన్ను మాటలూ, మనస్సూ, దేహం ఏవీ వర్ణించలేవు.' 'అహం బ్రహ్మాఽస్మి తత్త్వమసి' అనే యీ మాటలు బుసకొట్టే సర్పంలాగా ధ్వనిస్తాయి.

47

నేను ఎప్పుడు విముక్తి పొందుతాను?

'నేను' అనే అహంకారం చచ్చినప్పుడే.

48

ఈశ్వరు డంటే ఏమిటి?

ఒక విచిత్రమైన రహస్యం.

49

నిన్ను చూస్తున్న దెవరు? నీవు ఒకరివైపు చూస్తున్నప్పుడు నిన్ను చూస్తున్న దెవరు? నీలో నున్న ఈశ్వరుడు.

50

ప్రతివ్యక్తిలోనూ, ప్రతిదాంట్లోనూ, సృష్టిలోనూ, బీజంలోనూ ఉన్న అనంతశక్తికి, వాటిలోని అనంతత్వమే యథార్థకారణం. వాటి బాహ్యమైన ఆకృతుల్లో ఏమీ లేదు.

51

బీజంలోని ఒక అణువుకన్నా కూడా, బీజానికున్న అనంతశక్తీ, గుణాలూ అన్నీ వుంటై.

52

లోపల ఉన్న అనంతత్వం. అనంతశక్తి మారనిది. అది నిర్వికల్పమైంది. అనంతత్వం ఎట్లా చస్తుంది? అది ఎప్పుడూ చావదు.

.53

నీకు అజ్ఞానంవల్లనే అనాత్మ భావం కలుగుతున్నది. నీవు దేహానివి కావు. నీవు అనంతశక్తివి. దివ్యుడివి. నిర్వికల్పుడవు. నీకు మార్పు లేదు. నీ దివ్యత్వాన్ని గుర్తించు. విశ్వవ్యాపకుడవౌతావు.

54

అనంతుడైన ఈరాముడే అన్నింటిలో ప్రతిఫలిస్తున్నాడు. అజ్ఞానులు ప్రపంచంలోకి కుక్కల్లాగా వస్తారు. దీన్ని తలక్రిందు చెయ్యండి. ఈ ప్రపంచంలోకి, అద్దాల మేడలోకి, వచ్చే యజమానిలాగా రండి. కుక్క (D. O. G.) లాగా ప్రపంచం లోకి

రావద్దు. దేవుడి (G.O.D.) లాగా రావాలి. అద్దాల మేడకు అధికారి వవుతావు. విశ్వమే నీదవుతుంది.

55

మానవుని నైజప్రకృతి దైవత్వమే. భగవంతుడే ఆత్మ కాకుంటే, ప్రవక్తలూ, మహర్షులూ, ఉదయించి ఉండేవాళ్ళు కారు.

56

ఈ ప్రపంచమంతా ఒక స్వర్గం. భగవంతుణ్ణి మోసగించలేరు.

57

'నేను భగవంతుణ్ణి' అని చెప్పుకోకపోవడం పాపం.

58

వేదాంతం ప్రకారం స్పష్టపడ్డ సత్యం ఏమంటే 'నీవు అసలు దేవుడివి. నీవు దేవుడివి తప్ప ఇంకేమీ కాదు. దివ్యత్వం ఫలితరూపకం కాదు. అది గుర్తించదగింది.

59

వేదాంతం నిన్ను ఈ సత్యాన్ని గుర్తించ మంటుంది:- 'ఆనందం-ఇవ్వడంలో నేవుంది. అడగడంలోనూ, అర్థించడంలోనూ లేదు.'

60

వేదాంత ధర్మంలో, వ్యక్తి ఆస్తిపాస్తులు కలిగి వుండడం ఆత్మను ఉల్లంఘించడమే.

61

అనుభవ వేదాంత మంటే:-

ముందుకు పోతూ పోతూ చేసే కృషి
కుళ్ళిపోతున్న సోమరితనం కాదు;
నిరంతర కర్మానందం,
విరామ మెరుగని కృషి కాదు.
నిశ్చలశాంతి-
సంశయ వ్రణం కాదు.
నిర్మించుట-
ఛేదించుట కాదు;

సరియైన సంస్కరణ -
　　సంప్రదాయ సంరక్షణకాదు;
సత్యవిచారంకానీ,
　　చిలుకపలుకులుకాదు;
వాస్తవిక కవిత్వంకానీ,
　　పుక్కిటి పురాణాలుకాదు;
ప్రామాణికతర్కంగానీ,
　　మరణించిన రచయితగ్రంథప్రమాణంకాదు.
సజీవమైన సత్యంకానీ
　　మరణించిన ఉదాహరణం కాదు;
అనుభవ వేదాంతం కోరుకో!!

62

పుస్తకాల్లోని వేదాంతం, అరమరల్లోని పురుగులు తినడానికే. అదివద్దు. నీవు వేదాంతంలో జీవించు.

63

వేదాంతం నీభారం తొలగించకపోతే-నీకు ఆనందాన్ని ఇవ్వకపోతే-దాన్ని వదలుకో!

64

వేదాంతం ప్రకారం కారుణ్యం అంటే, దౌర్బల్యం.

65

వేదాంతం అనేకులను ఆకర్షిస్తుంది. బైబిల్లోని బోధలు, అందులో వుంటే ఉపదేశం వల్ల, అట్లా ఆకర్షిస్తుంది. వైదాంతిక అద్వైతాన్ని బలపరచని వేదాంతం, భూమిమీద నే లేదు. వేదాంతానుభవాన్ని, సత్యాన్ని, అభివృద్ధి పరచని శాస్త్రం లేదు. అందుచేత విద్యావంతుడైన హిందువుణ్ణి ఆకర్షిస్తుంది.

66

వైదాంతిక తత్వాన్ని వ్యాపింప చేయడానికి; వేదాంతంలో జీవించడం కంటే, రాజమార్గం లేదు.

67

'అనిర్వచనీయమైన, ద్వైతానికి అతీతమైన, స్థితిలోకి నీవు పోతే నన్ను కనుక్కొంటావు'. వేదాంతం ఇదే చెపుతుంది.

68

నీవు దేన్నైనా పొందగోరుతా వనుకో. నీడను వెంబడించవద్దు. నీ తలకాయ నీవు పట్టుకో. నీలోకి నువ్వు పో. తర్వాత నక్షత్రాలను నీవే చేశావనీ, ప్రియమైన, మనోహరమైన, ఆకర్షణీయమైన,వస్తువు లన్నిటినీ నీ ప్రతిభింబాలుగా దర్శించగలుగుతావు.

69

నీలోనే స్వర్గం వుంది. ఆనందం నీలో మూర్తీ భవించి ఉంది. అయినప్పటికీ వీధుల్లో ఆనందం కోసం వెతుకుతున్నావు. బాహ్యమైన విషయాలకు ఇంద్రియసుఖానికీ వెతుకుతున్నావు. ఎంత హాస్యాస్పదం ?

70

దైహికవాంఛలకు దాసుడివైనప్పుడు విశ్వానికి అధిపతి కాలేవు.

71

ఆ యుగంలోని అద్భుతవ్యక్తులందరినీ ఉపన్యసించనీ; క్రీస్తు, భగవంతుడే ఉపన్యసించనీ; ఈ

71

ఇతరుల ఉపన్యాసాలన్నీ, నీ హృదయానికి నీవు ఉపన్యసించుకోకపోతే నిష్ఫలం.

72

వేదాంతం నిన్ను అహంకారానికి, తీవ్రకృషి ద్వారా దూరం కమ్మంటుంది.

73

వేదాంతం, వేదాంతం-కోసం కృషి చెయ్యమంటుంది.

74

వేదాంతంలో కర్మ అంటే-పరమాత్మతో లీనమై విశ్వసంగీతానికి శృతిగల్పడమే!

75

కర్మ అంటే ఏమిటి?

తీవ్రమైనకృషి, వేదాంతం ప్రకారం విశ్రాంతి. నిజంగా కృషి చెయ్యడమే విశ్రాంతి.

76

ఈ బ్రదుకులో దుఃఖంనుండీ, పాపంనుండీ విముక్తి పొందడమంటే; శరీరానికి తీవ్రమైన పనికల్పించి, మనస్సు స్థిరంగా శాంతంగా ఉంచుకోవడమే.

77

అంతరాత్మను శాంతంగా ఉంచుకో! శరీరానికి నిరంతరం పనికల్పించు! శరీరాన్ని పాలించేది నిరంతరకృషి. ఆత్మకు నిర్వికల్పస్థితి.

78

నీ కృషి వ్యక్తిగతం గాకుండా, అహంకారానికి లోబడకుండా, స్వార్థాన్ని దాటిపోయి, చుక్కల పని లాగా, సూర్యచంద్రుల పనిలాగా భాసించాలి. అప్పుడే - నీకృషి విజయవంత మవుతుంది.

79

కృషినే విస్మరించే టంత తీవ్రంగా, దేహానికీ మనస్సుకూ పనికల్పించు.

80

అహంకారాన్ని త్యజించు. కృషిలో నిమగ్నుడవై దాన్ని మరిచిపో! విజయం అప్పుడే పొంద గలుగుతావు. విజయం పొందే ముందు-విజయవాంఛ కృషిలో, సమాధి కావాలి!

81

సాక్షిమాత్రుడవై దేనితోనూ సంబంధం లేకుండా దేనితో చలించకుండా, కర్మ చెయ్యి!

82

నీవు ఎక్కడ ఉన్నా సరే, త్యాగిలాగా ఉండు. యాచకుడివి కావద్దు. విశ్వానికంతటికీ, నీ కృషి చెందాలి. అది లేశమైనా వ్యక్తిగతం కాకూడదు.

83

నిరంతరం కృషి చెయ్యడమే, ప్రపంచంలో మానవుడి ఉత్తమయోగ్య ధర్మం. ప్రపంచానికి నీవు చాలా మేలుచేయగల్గుతావు - నీకోసమని నీవు పాటుబడకపోతే.

84

నిజమును పొందడానికి, అమృతత్వాన్ని పొందడానికి నీవు- నీ కృషిద్వారా నీ దైనందిన జీవితంలో, నీ దేహాన్ని, కండలనూ, రగిలే రగిలే కృషిజ్వాలల్లో ఆహుతి చెయ్యి. నీ దేహాన్ని, నీ సర్వాంగాలను ఉపయోగించాలి. వాటిని అనంత కృషిలో దహన

హించు. కృషిలోనే శరీరాన్నీ మనస్సునూ జపించు. కృషి - కృషి - నిరంతర కృషి చెయ్యి! తేజస్సు నీ ద్వారా ప్రకాశిస్తుంది.

85

నీలోని 'ఆత్మ'లో విశ్రాంతి తీసుకొమ్మంటుంది వేదాంతం.

86

ఓ కర్మయోగీ! విజయం నిన్నే అర్థిస్తుంది- నీవు విజయాన్ని అర్థించకపోతే.

87

స్వార్థంతో మనం చేసే నిరంతరకృషి. అంతా, మన ప్రయత్నాన్ని నాశనం చేస్తుంది.

88

నీవు అర్హుడివైతే, నీవు దేన్నీ కోర నవసరం లేదు. నీ కోర్కెలు వాటంతటవే సిద్ధి పొందుతై. సిద్ధి తనకు తానై నీదగ్గరకు వస్తుంది. నీవు అర్హతా, యోగ్యతా కలిగివుంటే సహాయం నీకు రావాలి.

**89**

ఏ క్షణంలో నైతే నీకోర్కెలు నీవు అధిగమిస్తావో, అప్పుడు నీవాంఛోద్దేశ్యం నిన్ను వెదకుతూ వస్తుంది. నీవెప్పుడైతే అర్థించడం, బిచ్చమెత్తడం మొదలుపెడతావో, విఫలుడవవుతావు. కోరికకు అతీతుడవు కా! అది స్వయంగా నీకరగత మవుతుంది; అది ధర్మం.

90

నీలోని స్వర్గాన్ని గుర్తించు. వెంటనే నీకోరికలన్నీ నెరవేరుతాయి. వ్యథా, వ్యాకులమూ నశిస్తుంది.

91

* పనులు, మాటలకంటే పెద్దగా మాట్లాడుతై.

**92**

నీ కృషి కృషికోసం చెయ్యి.

---

* పని చెయ్యకుండా మాటలు చెప్పడం నిష్ఫలం. పని చెయ్యడం అవసరం. పనే చెయ్యి నాల్కలతో మాట్లాడుతుంది. కర్మశూరులు కావాలి. వాచాశూరత్వం వ్యర్థం అని భావం.
సం పా.

కోర్కెలను త్యజించు. వాటికి అతీతుడవుకా. పరమశాంతి లభిస్తుంది. బ్రహ్మానందం పొందుతావు. నీకోర్కెలకు నీవు అతీతుడవైై, సత్యాత్మను కలసి నప్పుడే, అవి సఫలవంత మవుతై అని మరచిపోవద్దు.

93

తెలిసో, తెలేకో నీవు దివ్యత్వంలో విలీనమై నప్పుడే, నీవాంఛలు సిద్ధించే తరుణం వస్తుంది.

94

నీ కృషి విజయవంతం కావడానికి, నీవు కృషిని ఫలితాన్ని, కష్టనిష్ఠూరాలన్నీ దేన్నీ లక్ష్యం చెయ్య వద్దు. కృషిచేయడమే నీ ఆశయం.

95

జయాపజయాలూ, కష్టాలూ, ఫలితాలూ, ఏవీ నేను లెక్క చెయ్యను. నేను కృషిని ప్రేమిస్తాను. కాబట్టి కృషి చెయ్యాలి. కృషికోసం కృషిచేస్తాను. కృషి చెయ్యడం నా ఆదర్శం. కృషి నాజీవం. నా ఆత్మశక్తి. నేను కృషి చేస్తాను.

96

నీ కృషి ఎట్లా పరిణమిస్తుందో నని, వ్యసనపడ వద్దు. ప్రజలనుంచి ఏ ఫలితాన్ని ఆశించవద్దు. నీ కృషి ప్రశంశవిషయం కాని, దూషణ విషయంకానీ, నీవు విచారించవద్దు.

**97**

నీ హృదయాన్ని అర్పించడంలో, అపేక్షించ డంలో లగ్నం చెయ్యవద్దు. నిష్కామకర్మ చెయ్యి. ఒకరికి ఇవ్వడమే నీ ధర్మం. కాని, అడగడం కాదు. అన్నిటినీ, గుత్తకొందామనే దురలవాటు వదలిం చుకో!

98

నీ వాంఛను వదలిపెట్టి నప్పుడే, అది నిజమైన ఫలితాన్ని పొందుతుంది. ఎంతకాలం నీవు, ఆశా పాశానికి కట్టుబడి ఉంటావో, దాన్నే వాంఛిస్తుం టావో, దానికోసం పరితపిస్తుంటావో, అంతకా లమూ, అది ఫలితాన్ని పొందలేదు. నీవు దాన్ని వదలిపెట్టినప్పుడే, అది ఫలితం యొక్క అంతరా త్మను పొందుతుంది.

99

ఆలోచన విధికి ఇంకో పేరు.

100

ఈ ప్రపంచం, నీ పరిసరాలు, నీవు వున్నావు అనుకుంటే ఉన్నాయి!

101

నీవు ఎట్లాఅనుకుంటే అట్లా అవుతావు. యద్భావంతద్భవతి. నిన్ను నీవు పాపి వనుకో; నీవు పాపి వవుతావు. అవివేకి వనుకుంటే అవివేకి వవుతావు. నీవు బలహీనుడి వనుకున్నావో; ప్రపంచంలో ఏ శక్తీ నీకు ధైర్యాన్ని ఇవ్వలేదు. సర్వశక్తులు నీలో వున్నాయనుకొంటే, నీవు సర్వేశ్వరుడ వవుతావు.

102

ఒక వ్యక్తియొక్క ఒక భావాన్ని మార్చు చెయ్యి. అతని భావనాసరళి తలక్రిందు లవుతుంది.

103

రాబందు తాను ఎగిరే మేరదాటి ఎట్లా ఎగిరి పోలేదో, భావన తన పరిమితి దాటి పోలేదు.

104

భావనా- భాషా ఒకటే! భాష లేకుండా భావింప లేము. పశిపాపకు ఏభాషా తెలియదు. అందుచేత ఏభావమూ వ్రుండదు.

105

ఎవరైతే ఎప్పుడూ ఆలోచిస్తుంటాడో అతను భ్రాంతితోనూ, మనోవ్యాకులతతోనూ బాధపడు తుంటాడు. అతన్ని విద్యాంతు డనుకున్నా, విజ్ఞాని అనుకున్నా; పురుగులుతిన్న కొయ్యగా అతడు శూన్యుడు.

106

మానవుడు బహిస్సహాయాల నన్నిటినీ వదలి పెట్టి, అంతస్సులో ఉన్నటువంటి అనంతత్వాన్ని తెలుసుకున్నప్పుడే - నిజమైన విద్య ప్రారంభిస్తుంది. మానవుడు ఈ విధంగా అంతర్ముఖుడై నప్పుడు సహజమైననిజమైన విశిష్టమైన నవ్యమైన భావపరం పరలు ప్రభవిస్తాయి.

107

మన విద్యను ప్రచురించడంకోసం, పూర్వ గ్రంథాల్లో నుంచి వాక్యాలను వప్పచెప్పడం, ప్రమాణాలు చూపించడం, జీవితానికి సంబంధం లేనటువంటి ప్రాచీన గ్రంథాల నుంచి ఉదాహరణా లివ్వడం - నిజమైన విద్యకాదు.

108

విద్యయొక్క పరమావధి - మానవులకు కర్మ చెయ్యడం, నేర్పడం కాదు. కర్మానందాన్ని ప్రబోధించడం. కర్మమీాది ప్రేమను అభివృద్ధి చేయడం.

109

మోక్షాన్ని, స్వేచ్ఛను ప్రసాదించలేని విద్య వృథా. బానిసత్వాన్ని నేర్పే విద్య నాకు నిరుప యోగం.

110

ఒక ఉన్నతభావాన్ని నేర్పుతో ఆచరణలో పెట్టడం ఒకటీ - దాని మూలతత్వాన్ని గ్రహించడం అనేది ఇంకొకటీ.

## 111

మానవుడికి, జంతువుకు భేదం ఇందులో ఉంది- జంతువు విద్యను ప్రకృతితహా నేర్చుకుంటుంది. మానవుడు అంతశ్శక్తులచేత విద్యను నేర్చుకొని, సకల జగత్తును తన అధికారం క్రిందికి తెచ్చు కుంటాడు.

## 112

మానవుడు జంతువులకంటె ఉత్తముడని ఎంచ బడుతున్నాడు. ఎందుకంటే, మానవునియొక్క ఉద్రేకాలు హేతుయుక్తమై ఉన్నవి.

## 113

శిశువులకు ఉద్దేశ్యాలు ఉండవు. కానీ ప్రపంచంలో ఉన్న వస్తువుల్లో శిశువుకున్నంత ఉజ్జీవమూ, ఏదో ఒకపని చేయడం మీద ఆసక్తీ, దేనికీలేదు.

## 114

మానవజీవితమంటే ఏమటి? అనేక అడ్డంకులలో కూడుకున్నది. అవును. జీవితంయొక్క లోతులు తెలేనివానికి బ్రిదుకు అటువంటిదే. కాని ప్రేమమయ జీవనులకు అట్లాకాదు.

115

ఇంద్రియాలకు అస్తిత్వం ఎట్లా ఏర్పడింది? భూతాలవల్ల. ఈ భూతాలను ఎట్లా తెలుసుకుం టున్నాం? ఇంద్రియాలవల్ల. ఇది ఒక పెద్ద చక్రం. ఈ సూత్రం మేలుకోనున్నస్థితిలోని ప్రపంచం యొక్క మిథ్యాస్వభావాన్ని గురించి చెపుతుంది.

116

ప్రశ్నించేవాడు, ప్రశ్న వేయబడేవాడు, అని యిద్దరు ఉన్నంతకాలం మాయవున్నది. నేను, నీవు, ఉన్నంతకాలం దృశ్యమానమైన మిథ్యా జగత్తును అతీతులంకా లేము.

117

జాగ్రదవస్థయొక్క అనుభూతిమీద, యూరప్ అమెరికాల యొక్క తత్వం ఆధారపడివుంది. యూరప్ అమెరికాల తత్వానికి గాఢ నిద్రావస్థ యొక్క స్వాప్నికావస్థ యొక్క అను భూతి లేదు. హైందవుడు దాన్ని అసంపూర్ణత్వమంటాడు. దానివల్ల ప్రపంచ సమస్యా పరిష్కారం జరుగ దంటాడు.

118

ప్రపంచంలోవస్తువులన్నీ మాయ. ఎండిన నేల మీద గారడీవాడు సృష్టించిన సరస్సుల వంటివి. తత్సంబంధమైన విజ్ఞానం సంపాదించామని గర్విస్తున్న పండితుల విజ్ఞానంకూడా వట్టి భ్రాంతి.

119

ముందు నీ హృదయానికి సంబంధించిన విషయాలనుగురించి ఆలోచించు. తరువాత స్వాప్నిక ప్రపంచమూ, పరప్రపంచమూ, దానివిషయం అదే ఆలోచించుకుంటుంది.

120

ప్రాపంచక వాంఛాక్షేత్రంలో నాటిన ఆధ్యాత్మిక బీజాలు అభివృద్ధిచెందవు.

121

ఆధ్యాత్మిక శక్తుల్లోనమ్మి. అనంతమైన శక్తిలో నమ్మి. ఒకరిని విచారించవద్దు. ఒక అభిప్రాయాన్ని ఏర్పరచుకోవద్దు. ఒకరిని ఖండించవద్దు.

122

సింహాసనం మీద కూర్చున్న రాజదర్శనం మాత్రంచేతనే సర్వారు అంతా శిక్షతో కూడు కొని ఉంటుంది. భగవంతునిమీద ఆధారపడ్డవాని జీవితంలో అస్వతంత్రతలు, ఛిద్రత్వాలు ఉండవు.

123

పటకారు వస్తువును పట్టుకుంటుంది కానీ, దాన్ని పట్టుకున్నమనిషి వేళ్ళను పట్టుకోలేదు. మనస్సు తనకు మూలమైన, తెలుసుకో రానటువంటి దివ్యత్వాన్ని తెలుసుకోలేదు.

124

వేదాల్లోఉన్న జ్ఞానభాగమే నిజమైన వేదం. అదే శ్రుతి. సర్వమతాల్లోని తత్త్వ వేత్తలు దాన్నే ఉదాహరించారు.

125

దైహికమైన బలహీనత కనుపించినప్పుడే మనం, ఈడెన్ (స్వర్గవనము) నుంచి పడిపోతాము. భిన్నత్వాన్నీ, అనేకత్వాన్నీ, చూచినప్పుడే స్వర్గంనుంచి

క్రిందికి పడతాము. దేహంలో మాంసాన్ని, పరిత్యజించినప్పుడే పోయిన స్వర్గాన్ని మళ్ళీ పొందు తాము.

126

పరిత్యాగధర్మాన్ని నరనరాల్లోకి పాకేటట్లు చేసుకో. స్వార్థాన్ని విడిచిపెట్టు. నీ కాంతిని యితర్ల మీద ప్రతిఫలింపజెయ్యి.

127

కర్మసూత్రాన్ని, అది భగవంతుడియిచ్ఛ అని త్రోసివేయవద్దు. ప్రశ్నకు జవాబు చెప్పు. పలాయన వాదం అవైదాంతికమైంది. పలాయన వాద మంటే, మీ అజ్ఞానాన్ని ప్రకటించుకోవడం.

128

తప్పులుచేసేవాండ్లయొక్క తప్పులు మాత్రం నిందించు. చేసేవారిని నిందించడానికి నీకధికారం లేదు. నీకు యితర్లను విచారించడానికి హక్కు లేదు.

129

ముండ్లు లేని గులాబి పువ్వు లేదు. కలుషితంకాని

మంచి, ప్రపంచంలో కనుక్కోలేము. అంతా మంచి, ఆత్మలోనే యుంది.

130

మనిషి తనలోపలి ఆనందం కనుక్కోవడం చాలా కష్టం. ఇతర చోట్ల కనుక్కోవడం అసాధ్యం అంటాడు 'స్కోపెన్ హార్'

131

ఇనుముతో, బంగారంతో, ఇనుమూ బంగారం మాత్రమే కొనవచ్చు. ఆనందం అట్లాంటి భౌతిక వస్తువు కాదు. అమూల్య మైంది.

132

పరిస్థితులమీద సుఖం, ఆనందం, ఆధారపడి వుంటదని భ్రమించవద్దు. అట్లా భ్రమిస్తే మీకు సుఖంలేదు. సుఖం ముందు పరుగెత్తుతూ వుంటుంది. మీరు దాన్ని పట్టుకోలేక వెనుక పరుగెత్తుతారు.

133

ఎలాంటి వాడికి అలాంటిదే లభిస్తుంది. బహ్మానందం నీలో కలిగివుండు. విజయానందం నీవద్దకు దాని అంతటదే వచ్చి తీరుతుంది.

**134**

ఏ మానవుని జీవితం ఒక నిరంతర యజ్ఞమో ఆ మానవుడు ధన్యుడు. సుఖి !

135

సకల ప్రపంచాన్ని స్వర్గవనంగా చూడగలిగిన మానవుడు, మాధుర్యం కలిగిన మానవుడు, స్త్రీ పురుషులయొక్క జీవితాల్లో, ఆ వేదనల్లో, బ్రహ్మాండ జీవనశ్వాసను చూడకలిగినవాడు, నందనవనమారుతాన్ని దర్శించగలిగినవాడు, బాధల్లో గులాబి పూలవాసన చూచేవాడూ, ఆమానవుడే ఆనందమయుడు.

136

అహంకారం తగ్గితే, దైహిక బానిసత్వభారం తగ్గుతుంది. బ్రదుకు బరువు తగ్గుతుంది. ఆరోగ్యమూ శక్తి కాపాడబడుతుంది.

137

నీకు నీవు సత్యంగా ఉండు. లోకాన్ని లెక్క చెయ్యవద్దు.

**138**

ప్రపంచబాధ కంతటికి కూడా మూలకారణం, మనకు అంతర్దృష్టి లేకపోవడం. మన అభిప్రాయాల మీాద మనం ఆధారపడకపోవడం, బైట శక్తుల మీాద ఆధారపడి వుండడం.

**139**

మిత్రుల దెగ్గరనుంచీ, శత్రుల దెగ్గరనుంచీ వచ్చే టటువంటి బాధాకరమైన విమర్శ నిన్ను బ్రహ్మజ్ఞా నంలోకి మేలుకొల్పే ఒక గొంతుమీాద కూర్చున్న దెయ్యం.

**140**

నీలో స్వర్గం ఉంది. ఇంద్రియ సంబంధమైన వస్తువుల్లో ఆనందాన్ని అన్వేషించవద్దు. నీలోనే ఆనందం ఉందని తెలుసుకో!

**141**

స్వర్గం నీలో ఉంది. సౌఖ్యం నీలో ఉంది. అటు వంటప్పుడు ఆనందంకోసం బైట ఎందుకని వెదుకు తావు?

142

మానవుడు తనగతికి తానే కారకుడు.

143

సృష్టి అంతా నీచేతనే సృష్టింపబడింది. సృష్టి నీ యొక్క భావం. నీవు నీచుడనని దీనుడనని ఎందు కనుకుంటావు? నీవు భగవంతుని అవతారానివని ఎందుకు అనుకోవు?

144

భగవంతునిలో ప్రతిగల్పడం వల్లనే విజయం లభిస్తుంది. భగవంతునిలో విలీనమైనప్పుడే విజయం లభిస్తుంది. నీలో మంచి ఉన్నప్పుడే విజయం లభిస్తుంది.

145

ఏమానవుడి ఆత్మశాంతి, సర్వదృశ్యం మీద సౌందర్య తేజం వెదచల్లుతోందో, ఏమానవుని అంతస్సులో దివ్యప్రేమ తప్ప యితరం ప్రసరింపదో, అతడే స్వతంత్రుడు - ముక్తుడు.

146

స్వతంత్రుడైన మానవుడికి, సకల ప్రకృతి జోహారు చేస్తుంది. ప్రపంచమంతా సాష్టాంగ పడుతుంది. స్వాతంత్ర్యమూ, బ్రహ్మైక్యమూ, అచంచలమైన సత్యాలు-ఒకనాటికి తెలుసుకోబడతాయి.

147

నీకే నీవు బాధ్యుడివి. ఆనంద ధర్మాన్ని, శాంతి ధర్మాన్ని, అతిక్రమించినట్లయితే నీవు నిన్నే హత్య చేసుకున్న పాపివి అవుతావు..

148

ఓం. (అ + ఉ + మ, A. U. M) ఈ మంత్రంలో అ, A అన్న అక్షరానికి అర్థం 'సత్యం' నీవే! జాగ్రదవస్థలోని మిథ్యామయ భౌతిక ప్రపంచ సృష్టి చేస్తూవున్నది. ఉ—U అన్న అక్షరం మనః ప్రపంచాన్ని తెల్పుతుంది.మ - M అన్న అక్షరం కల్లోలమయమై నటునటించే యీ ప్రాపంచక స్థితికి అతీతమైన నిశ్చలమైన బ్రహ్మపదార్థాన్ని తెలుపుతుంది.

149

పవిత్రమైన ఓంకారమంత్ర సత్యానికి వ్యతిరేకించిన శాస్త్రం వృథా.

150

ఓంకారంలో బ్రతికే మనిషి, ఆనందమయుడు. ఓం అనే మంత్రం స్వర్గద్వారాన్ని తెరుస్తుంది. ఆనందభాగ్యాన్ని ప్రసాదిస్తుంది.

ఓం. ఓం. ఓం.

# ప్రేమ — భక్తి

1

ప్రేమ అంటే, నీ అద్వితీయత్వాన్ని అనుభవ పూర్వకంగా సకలమానవుల్లో తెలుసుకోవడం.

2

ప్రేమ ఒక శాస్త్రం. ఎంతశాస్త్రమో అంతకళ. ప్రేమ ఒక మహాగ్నిహోత్రం, ఒకసూర్యబింబం, ఒక అద్వితీయభావం, శాస్త్రజ్ఞానం, శాస్త్రపరిశోధన, ఆమహాగ్నిహోత్రంలోనుంచి బహిర్గతమైన రవ్వలు.

3

ధార్మికమైన ధర్మసూత్రం.ఒకప్రేమ మాత్రమే. ప్రేమను బ్రదకడమంటే, నిన్ను నీవు నమ్ముతూ బ్రదకడం.

4

సూర్యబింబంవలె, నిజమైన ప్రేమ ఆత్మకు వికాసమూ, వ్యాకోచమూ యిస్తుంది. తేలికమైన మోహం, మంచువలె ఆత్మనుకప్పి ఆత్మకు సంకోచాన్ని కలుగజేస్తుంది.

5

ప్రేమను ఐహికసంబంధాలచేత బంధించవద్దు.

6

భక్తి (ప్రేమ) అరవడంకాదు. అహుక్కోవడం కాదు. సమానత్వాన్ని తెలుసుకోవడం. ప్రేమ కాంతివంతమైన మాధుర్యం, దివ్యమైన స్వేచ్ఛ, భగవంతుణ్ణి సర్వపదార్థాల్లో దర్శనం చేసుకోవడం, కంటికి కనుపించిన ప్రతివస్తువులో నిన్ను చూచు కోవడం-భగవంతుడు సౌందర్యం, నేను భగవంతుడు తత్త్వమసీ. ఇదే ప్రేమ.

7

మోహసంబంధ శృంఖలలను త్రెంపివేసిన ప్రేమ, ఉత్తేజితమైన ఆధ్యాత్మిక జ్ఞానం.

8

ఇద్దరు మానవులు ప్రేమించుకున్నప్పుడు ఈద శాంతి నశిస్తుంది.

9

జీవిత యుద్ధంలో గెల్చేది ఒక్కటే, అది ప్రేమ.

10

ప్రేమ, సౌందర్యదర్శనం.

11

ప్రేమ ఒక్కటే దివ్య ధర్మం. ఇతరధర్మాలు దొంగతనం. ధర్మ శృంఖలలను తెంచివెయ్యాను హక్కు ప్రేమకు మాత్రమే వున్నది.

12

ప్రేమ- దివ్యజ్వాల. మన్మథభావంకాదు. కామభావం అనుకోడం ప్రేమకు కల్పింపబడ్డ అపార్థం.

13

ప్రేమ ఉజ్జీవనం కలుగజేస్తుంది. ఉద్రేకం ఇస్తుంది. ఉద్రేకం ఆలోచనకంటె ముందుపోతుంది

14

అన్నికోరికలూ ప్రేమ. ప్రేమ భగవంతుడు; భగవంతుడు నీవు.

15

ప్రేమ ఉన్నచోట, ఎక్కువతక్కువలు లేవు; కొద్ది గొప్పలు లేవు.

16

నీవు ప్రేమమయుడవైనప్పుడు, అన్నివిచిత్రాలు సాధ్యమవుతాయి.

17

ప్రేమించనివాడు బ్రహ్మజ్ఞాని కాలేడు.

18

సంకుచితం చేయబడిన ప్రేమే, భయం కాక పోతే ప్రేమ భయాన్ని ఏవిధంగా జయిస్తుంది?

19

దుష్టమైనటువంటి ప్రేమ, భగవంతుడికి అవమానం.

20

భిన్నత్వంవల్ల, వియోగంవల్ల, దుఃఖం కలుగుతుంది. జ్వరతాపం కలుగుతుంది. సర్వానికి అధినాయకుడైన భగవంతునితో సంయోగంవల్ల జ్ఞానమూ, సిద్ధీ, లభిస్తాయి

21

రోగం ఏమిటి? ప్రేమ లేకపోవడం, నీడలవెంట

పరుగెత్తడం. అపాయంయొక్క మిథ్యాస్వప్నాలకు దాస్యం చేయడం.

22

ప్రేమ ధర్మాన్ని అనుభవిస్తే ఆచరిస్తే శాంతి కలుగుతుంది. వాతావరణంతో పోట్లాడి ఏమి లాభం? చెడ్డ వార్త వచ్చిందని 'టెలిఫోను రిసీవరు' పగలగొడితే ఏమి కార్యం?

23

మిథ్యలవల్ల, డంబాలవల్ల, గౌరవనామంతో వ్యవహరింపబడుతూ వున్న అవమానాలవల్లా, తీరని అపాయం జరుగుతుంది. ప్రేమ, ప్రభుత్వం చేసిన చోట సైన్యం ఉండదు.

24

మానవుడా, నీకంటె చూపులవల్లనే, నీవు వస్తువులను ఆకర్షణీయంగా చేసుకొంటున్నావు. ఆ చూపువల్లనే ప్రేమలో పడిపోతున్నావు.

25

కాలం, ప్రేమను అనుసరిస్తుంది.

26

హృదయాన్ని వశంచేసుకో, తరవాత హేతువు, హేతువువల్ల నిరాశ కలిగినప్పుడు, ప్రేమవల్ల ఆశ కలుగుతుంది. ఒక కథలో ప్రయాణీకుడి కోటును గాలి తీసివేయలేకపోయింది. కానీ వేడి తీసివేయించింది.

27

ఆస్తి దొంగిలింపబడ్డ మానవుడెంత ధన్యుడు? భార్య లేచిపోయిన మానవుడు, అంతకంటే మూడురెట్లు ధన్యుడు. అందుచేత అతనికి విశ్వప్రేమ ఎక్కువ సన్నిహితమవుతుంది.

28

* ప్రభూ! నా ప్రాణాలుతియ్య. నా ప్రాణాలు నీకు అంకితం చేసుకో.

---

*ఈ పద్యంలో 'ప్రభూ' అన్నమాటకు అర్థం స్వర్గంలో మబ్బుల్లో కూర్చున్న సోమరిపోతు కాడు. సకలమని, అనంతకోటి మానవులని అర్థం. —సంపా.

29

ప్రేమ- సృష్టికి మూలం. తరళమైన జగత్తుకు అంతం. ప్రేమకు అతీతమైంది ఏమీ లేదు. పూలవలె అన్నీ ఒకసూత్రంలోనే గుచ్ఛబడి ఉన్నాయి. ఆ సూత్రం ప్రేమ. ప్రేమకు అవతల ఏమీ లేదు.

ఓం. ఓం. ఓం.

# 5

# సర్వసంగపరిత్యాగం



అనువాదం:

కేశవతీర్థులు

# సర్వసంగపరిత్యాగం

1

మహోత్తమ పరిత్యాగం, లేక సేవకు పరిత్యాగ పదం, కర్మలోనుంచి కోరిక తీసివేయడం.

2

తుమ్మెద కాళ్ళకంటుకున్న మధువును విదలించిన విధంగా, నెమ్మదిగా, దృఢసంకల్పంతో, రూపాలమీంది, వ్యక్తిత్వాలమీంది, మోహాన్ని మనం త్యజించాలి.

3

ఒకటి తరువాత ఒకటి నీ సంబంధాలు తెంచుకోవాలి. బంధాలు సడలించుకోవాలి. అలా చేయకపోతే, మృత్యువే నీ కోర్కెలను త్యజింప చేస్తుంది.

4

ధర్మచక్రం కరుణావిరహితమై పరిభ్రమిస్తుంది. ధర్మాన్ని జీవించినవాడు ధర్మాన్ని స్వీకరిస్తాడు. భగవదుద్దేశ్యాన్ని (ధర్మం) అతిక్రమించినవాడు, నలగదొక్కబడతాడు. ఘోరయాతన బడతాడు.

5

హిందువులు ఈ పరిత్యాగాన్ని జ్ఞానంగా వర్ణించారు. అంటే పరిత్యాగమూ, జ్ఞానమూ, ఒకటే. వాటికి భేదంలేదు.

6

పరిత్యాగానికి పర్యాయపదమైన జ్ఞానమే 'సత్యజ్ఞానం' అదే ఆత్మజ్ఞానం, స్వరూపజ్ఞానం, ఈ జ్ఞానమే సర్వసంగపరిత్యాగం, ఆ జ్ఞానాన్ని పొందు' అప్పుడు నీవు సర్వసంగ పరిత్యాగివి.

7

త్యాగానికి, నీ గృహంతో, పదవితో నీదైహిక కర్మలతో పని లేదు. వాటితో దానికేమీ అవసరం లేదు.

8

త్యాగం నిన్ను, నీకు అనుకూలమైన మంచి స్థానంలో ఉంచుతుంది.

9

త్యాగం నీశక్తులను ఉద్దీపింప జేస్తుంది. నీ శక్తు

లను బలపరుస్తుంది. నిన్ను దేవుని చేస్తుంది. నీ భయాలు, విచారాలు, పోగొడుతుంది. నీవు నిర్భయుడివి, ఆనందమయుడవౌతావు.

10

మనలో స్వార్థంపోయినప్పుడే, కార్యం నెరవేరుతుంది! ఏనిముషం; స్వార్థం నీలో జనిస్తుందో, అప్పుడే కార్యం చెడిపోతుంది. అభేద భావంతో చేసే కార్యమే; ఉత్తమకార్యం. పరిత్యాగానికి అర్థం. ఈవ్యక్తిగతమైన స్వార్థంనుండి విడిబడడం, ఈ అనాత్మభావం పరిత్యజించడం.

11

పరిత్యాగమంటే సన్యాసాశ్రమంకాదు.

12

పరిత్యాగమంటే ప్రతివస్తువును పావనంచెయ్యడం.

13

శిశువును పరిత్యాగం చెయ్యడమంటే శిశువుతో

వుండే సంబంధం అంతా తెంచుకోవడంకాదు; శిశు వును, మనుమణ్ణి, దేవుడిగా చూడడం.

14

వేదాంతరీత్యా, అందరిలో వుండే దైవత్వాన్ని గుర్తించడమే పరిత్యాగం.

15

స్వార్థాన్ని,వ్యక్తి బంధాలూ, పరిత్యాగంచెయ్యి. ప్రతివాడిలో, దైవత్వాన్ని దర్శించు. అందరిలో దివ్యత్వాన్ని దర్శించు.

16

నీ సత్యాత్మ యొక్క సర్వవ్యాపకత్వాన్ని, ప్రపంచం యొక్క శూన్యత్వాన్ని, మనస్సులో నిరంతరం విచారిస్తూ సర్వవ్యాకులతనూ, భయాన్ని, వ్యసనాన్ని, ఆతురతనూ, పారద్రోలడమే అనుభవ పరిత్యాగం

17

నీవునిర్వర్తించ వలసిన బాధ్యతలు లేవు. నీవెవ రికి బాధ్యుడవు కావు. నీకు తీర్చవలసిన ఋణం

లేదు. నీ కెవరి బంధమూ లేదు. అన్ని సంఘాలకూ, జాతులకూ, ప్రతిదానికీ, విశిష్టంగా నీ ప్రత్యేకత్వం నిలబెట్టుకో. అదే వైదాంతిక పరిత్యాగం.

18

ప్రతి వస్తువూ నీవే. దెయ్యాలు, భూతాలు, దేవతలూ, దేవమాతలు, పాపులు, పవిత్రులు, అందరూ నీవే. దాన్ని తెలుసుకో. అనుభవంలోకి తెచ్చుకో. నీవు ముక్తుడవని గ్రహించు. సర్వసంగ పరిత్యాగానికి ఇదే మార్గం.

19

పరిత్యాగమంటే, స్వార్థజీవితాన్ని వదలు కోవడం. గడ్డుకట్టుకున్న అహంకార జీవితాన్ని త్యజించడంలోనే, అనంతజీవితం, మృత్యుంజయత్వం ఉన్నది. నిజంగా ఉన్నది.

20

పరిత్యాగం ఒక్కటే అమరత్వం, శాశ్వతత్వం కలుగజేస్తుంది.

21

నీవెప్పుడూ పరిత్యాగ పర్వతంమీద వుండాలి. ఆవిధంగా అనుకూల స్థానంలోవుండి ఏపనిలోనైనా సరే మగ్నంకా. నీకు అలసట వుండదు. అన్ని పనులూ నీకు సమానంగా ఉంటాయి.

22

సన్నిహితమైన వాటిని, ప్రియమైన వాటిని, మొట్టమొదట పరిత్యాగం చెయ్యాలి. 'నేనిది చేస్తున్నా' నేను ప్రతినిధిని, నేనుఅనుభవించేవాణ్ణి, అనే యిలాంటి అసత్య అహంకారం జనింపజేసే భావాలు పరిత్యాగం చెయ్యాలి.

23

అరణ్యాలకు పోవడం, పరిపూర్ణత పొందడానికి సాధనా మాత్రమే, కళాశాలకు పోవడంలాంటిది.

24

వేదాంతయోగాన్ని తెలుసుకోడానికి అరణ్యాగమనం చేయవలసిన అవసరంలేదు. తీవ్రసాధన

చేయనవసరం లేదు. కార్య నిమగ్నుడవైనప్పుడు, నీవు శివుడికే జనకుడివి.

25

పరిత్యాగం నిన్ను హిమాలయ సాంద్రారణ్యాలకు పొమ్మని కోరదు. నిన్ను గుడ్డలు కట్టుకోవద్దని చెప్పదు. పరిత్యాగం నిన్ను పాదరక్షలు లేకుండా, నెత్తిమీద గుడ్డ లేకుండా, నడవాలని కోరదు.

26

పరిత్యాగాన్ని, నిస్స్పృహ నిస్సహాయత్వం చేతగాక వదులుకొనే దుర్బలత్వంగా, మూఢవైరాగ్యంగా, పరిగణించగూడదు. ఏమాత్రమూ వదనుకుండా నీ దేహాన్ని క్రూరమైన కండలు పీక్కుతినే తోడేళ్ళకు పెట్టడం; పరిత్యాగంకాదు.

27

నీవు నిన్ను సత్యానికి భిన్నంగా చూచుకొని దానికి వేరై, మతంపేరుతో త్యాగంచేయడానికి ప్రారంభిస్తే, నీది కానిదానిని అపహరించడ మవుతుంది. అది అక్రమం.

28

ప్రేమద్వారా, పరిత్యాగం చెయ్యని నాగరి కుడు ఎక్కువ అనుభవంగల, తెలివిగల, పశు తుల్యుడు.

29

పరిత్యాగంలో తప్ప ఇంకెక్కడా నిజమైన ఆనందం లేదు, పరిత్యాగంలో తప్ప వేరే దైవ జ్ఞానం లేదు. (ఉద్యోగం) పరిత్యాగంలో తప్ప వేరే ప్రార్థన లేదు.

30

దైవత్వమన్నా, పరిత్యాగమన్నా, ఒకటే. విద్యా, శీలమూ, దాని బాహ్యస్వరూపాలు.

31

సౌందర్యమే పరిత్యాగం;అహంకార జీవితాన్ని వదలుకోవడం.

32

వైజ్ఞానిక చర్చలకూ, వైదాంతిక తర్కాలకూ, నీవు దూరంగా పో; అది నాకు తెలుసు. సౌందర్యమే, ప్రేమ. ప్రేమే సౌందర్యం, ఆరెండూ పరిత్యాగం.

**33**

హృదయ పారిశుద్ధ్యం అంటే, నిన్ను నీవు ప్రాపంచిక వస్తుమోహం నుండి విముక్తి పొందించు కోవడం. అనగా రవ్వంతకూడా లోటుకాని, సర్వ సంగపరిత్యాగ మన్నమాట.

ఓం ఓం ఓం

# 6

# ధ్యానం



అనువాదం

కేశవతీర్థులు.

# ధ్యానం

1

వాంఛాతీతుడు కావడమే ధ్యానం.

2

వాంఛలు 'ఏకాగ్రితను' భంగంచేస్తాయి. పవిత్రిత, ఆత్మజ్ఞానం, లేనిదే నిజమైన ఏకాగ్రిత కలగదు.

3

సూర్యులకు సూర్యుడని, తేజస్సులకు తేజస్సని, సునసత్యాత్మను గుర్తించడమే, వైదాంతిక చిత్తైకాగ్రితలో ముఖ్యవిషయం.

4

ఓంకారాన్ని గానంచెయ్యి. జపించు. జపించేటప్పుడు నీ హృదయ సర్వస్వాన్ని ఓంకారాయత్తం చెయ్యి. నీ సర్వశక్తులు, తన్నిమగ్నంచెయ్యి. తాదాత్మ్యంపొందు, దాన్ని తెలుసుకోడానికి నీ సర్వ బలాన్ని వినియోగించు.

5

ఓంకారాని కర్థం "అహంబ్రహ్మాస్మి" తత్త్వమసీ ఓం "ఆతడే నేను" ఓం. ఓం.

6

ఆజపసమయంలో, సందుదొరికితే నీ దుర్బలత్వాలు, వ్యామోహాలు, నీ మనస్సును కలత పెడతాయి. నీ పాదాలకింద వాటిని తొక్కిపట్టు. అణగదొక్కు. అతీతుడివిగా విజయం పొందు.

7

సర్వ దేహాభిమానం ఉపసంహరించు స్వార్థాన్ని, స్వార్థసంబంధాలన్నిటినీ, దూరంచెయ్యి. నీది నాది' అనే భావాన్ని పోగొట్టు; వాటి కతీతుడివికా.

8

సత్య పరితాపం. దివ్యాత్మానందాన్వేషణం, అలాంటి మనస్స్థితిలో నీవుండిపోవడం, ఆదివ్య మధురాధరాలకు వేణు వందించడము.

9

ఇలాంటి మనస్థితిలో, ఇట్టి హృదయశాంతిలో,

పవిత్ర హృదయంతో, ఓంకారమంత్రం జపించు; పవిత్ర ఓంకారాన్ని గానంచెయ్యి.

10

ఇది వేణువులో సంగీతవాయువు వూదడం. నీజీవిత సర్వస్వాన్ని వేణువుగా చెయ్యి. నీ సర్వ శరీరాన్ని వేణువుగా మార్చు. దానిలో స్వార్థాన్ని ఖాళీచెయ్యి. దివ్యగంధంతో నింపెయ్.

11

ఓంకారాన్ని జపించు; అట్లు చేస్తూ నీ మనస్సు రస్సు పరిశోధించు. ఆ సహస్రజిహ్వాల విషసర్పాన్ని దానిలో వెదుకు. వాంఛాసమూహాలు, ప్రాపంచిక భావాలు, స్వార్థాశయాలే, యీ క్రూరసర్పానికి ఉండే తలలు, నాలుకలూ, కోరలు. ఒక్కొక్కటి అణగద్రొక్కు. పాదాలక్రింద నలిపివేసై. విధ్వంసం జెయ్యి. ఓంకార గానంచేస్తూ వాటిని వినాశనం చెయ్యి.

12

ఈ దేహానికీ, దానిపరిసర పరిస్థితులకూ, మన

స్సుకీ, దాని ఉద్దేశ్యాలకీ, విజయాభిలాషా భయానికి, నీవు అతీతుడవని భావించు.

13

సర్వవ్యాపితమైన ఉత్కృష్టశక్తివి నీవని, సూర్యులకు సూర్యుడు, కారణాలకు జగత్తుకు అతీతుడవనీ, సర్వుల్లో, బ్రహ్మానందంలో, స్వేచ్ఛారాములో, ఐక్యం పొందానని భావించు.

14

సహజంగా స్వేచ్ఛాశ్రుతులతో నీ కనుకూలమైన ఓంకారాన్ని గానం చెయ్యి. ఓంకారాన్ని జపించు.

15

ఒక్క క్షణకాలం నీవాంఛ లన్నిటినీ వదిలెయ్యి. ఓంకారాన్ని జపించు. మోహంలేదు. అపజయం లేదు. సంపూర్ణ సమత్వం అప్పుడు స్వరూపం దాల్చిన దివ్యతేజానిధి నీవు. సకల జగద్విషయాలు బహిష్కరించు. వాంఛాభూతాలను పారదోలు. మోహరోగాన్ని పోగొట్టుకో. ఒక వస్తువు మీది

వ్యామోహం, నిన్ను సర్వేశ్వరుడికి దూరం చేస్తుంది.

16

హృదయాన్ని పరిశుద్ధం చేసుకో ఓంకారగానం చెయ్యి. నీ బలహీనకారణాలన్నీ గుర్తించు. వాటిని నిర్మూలంచెయ్యి. మనోహరగుణస్వరూపంతో, విజయంతో వెడలిరా;

17

శ్రీ కృష్ణుడు కాళీయుణ్ణి చంపిన తరువాత నదీగర్భంలో వుండే ఆ సర్పరాజు భార్యలు కృష్ణుణ్ణి పూజించారు. అదే విధంగా మోహసర్పాన్ని, సంహరిస్తే వాంఛాఫలితాలు నిన్ను సేవించడం చూస్తావు.

18

దేహాతీతుడవుగా నీవు అనంతావని, పరమాత్మవని భావించు. తెలుసుకో; ఇంక నిన్ను ఏ విధంగా తృష్ణ పీడిస్తుంది ?

19

నీ సత్యాత్మను, సంఘమూ, ఆచారనియమాలు,

చట్టాలు, విమర్శలు, ఎప్పటికీ స్పృశింప లేవు- అని భావించు. వాటిని తోసివెయ్యి. అవి నేనుకాదని తెలుసుకో. ఈ అర్థంతో ఓంకారజపం చెయ్యి సర్వదుఃఖ పరిస్థితుల్లో ఓంకారాన్ని జపించు.

20

అఖిలానందం, దివ్యనాదం, బ్రహ్మానందము, నీవని భావించు.

21

సర్వాభిప్రాయాలు, ప్రాపంచికసంఘాలు, నీ ఊహామాత్రాలని, నీవే సత్యశక్తివని, సర్వ జగత్తూ నీఛాయా మాత్రమని, ప్రతినిత్యమూ, పగలూ, రాత్రీ, ఆ పరమ సత్యాన్ని ధ్యానించు.

22

నీవు తినే ప్రతికబళం, ఈ బాహ్య జగ ద్రూప మనీ, ఈ జగత్సర్వాన్ని నాలో లయం చేసుకుం టున్నా నని, నీవు భావించాలి.

23

నిద్రపోయేముందు - కనులు మూయటానికి

పూర్వం - అహర్నిశలూ; మేలుకొనేటప్పటికి, నేను వేదాంత సత్యస్వరూపుణ్ణి కావాలని, ధృఢంగా సంకల్పించు.

24

'నాది' అనుకొనే ఆ శరీరానికి రోగం వస్తే లెక్క- చెయ్య వాకు. దానివిషయం చింతించ వాకు. నీవే ఆరోగ్యాని వనీ, పూర్ణారోగ్యం నీదేనని, భావించు. భావించు. వెంటనే శరీరం దాని అంతట అదే స్వస్థత పడుతుంది.

25

ప్రాతఃకాలంలో నీవు ఓంకారం జపించేటప్పుడు దాన్ని ఉజ్జీవించడానికి, దాన్ని సాధన చేయడానికి, ధృఢంగా తీర్మానించుకో. నీ వే పనిచేయబోయినా ముందర జాగ్రత్తపడు.

26

బాగా నోటితో గాలిపీల్చు. ముక్కుల్లో నుంచి బైటికి వదలు. సక్రమంగా ఈపని నీవు సాధనం చేస్తే, దానివల్ల నీ కెంతో వికాసం గలుగుతుంది.

27

రాముడు మీకు అతిసహజమైన ప్రాణాయామం చెబుతాడు. గాలిపీల్చండి. పీల్చండి. బాగాపీల్చండి. బాగా పీల్చడంచేత గర్భంలో; క్రిందిభాగంలో, గాలి నిండు తుంది. ఇంకా లోపల ఉండే అన్ని నాళాల గుండా పోతుంది. ఈ విధంగా శీఘ్రంగా నీవు నిరుత్సాహ విముక్తుడ వౌతావు. నీ శక్తులన్నీ మంచి ప్రయోజనకారు లవుతాయి.

ఓం. ఓం. ఓం.

# 7

# ఆత్మానుభవం



అనువాదం:

కుందుర్తి ఆంజనేయులు బి. ఏ.

# ఆత్మానుభవం

1

ఆత్మజ్ఞానము నిన్ను బహిశ్శక్తుల ప్రాబల్యం నుంచి విముక్తి చేస్తుంది. నీ మీాదే నువ్వు ఆధారపడి ఉండగలిగేట్లు చేస్తుంది.

2

పాపాలనుండీ, అన్ని ఆకర్షణాలనుండీ, తప్పించుకోను- ఒకటే మార్గండుంది; సత్యాత్మను తెలుసుకోవడమే,

3

నిన్ను ఆకర్షించి, వశంచేసుకొనే భోగభాగ్యాల మీాది వ్యామోహం వదిలేశేవరకు, నీవు పశువృత్తులను (కామక్రోధాది అరిషడ్వర్గాలను)ఆపుకోలేవు.

4

ఈ విషయాన్ని గనుక తెలుసుకుంటే సర్వమైన మనోవికారాలకు, అతీతుడవై, సంపూర్ణంగా స్వాతంత్రుడవై తావు. బ్రహ్మానందంలో నిండిపోతావు- అదే స్వర్గమంటే.

5

ఆత్మజ్ఞానం సాధించబడేదికాదు. దివ్యదృష్టి పొందను నీవేమీ చేయనక్కరలేదు. నీచుట్టూ అల్లుకున్న వాంఛలను తొలగించుకోవడమే.

6

నీ దైవత్వాన్ని స్థిరీకరించుకో. ఈ వరకు అస ల్లేదనుకోని నీ అహంకారాన్ని మరచిపో! ఒక చిన్న నీటిబుడగ పగిలి సముద్రంగా ఐపోతుంది. (అలాగే) నీవే సర్వానివి; అనంతానివి; భగవంతుడివి ;

7

నీవు సనాతనౌన్నత్యంతో ప్రకాశించు. ఓసర్వ సంపూర్ణుడా! నీకొకవిధి అంటూ లేదు. చేయ వలసిన పనీ, లేదు. గాలి పీల్చుకొనే అవకాశం కూడా లేకుండా,నీకోసం ప్రకృతి వేచి ఉంది.

8

జంతు - మనుష్య - భావాలను తీసివేసుకుంటే వాటికి బదులుగా దివ్యభావాలు (నీలో) ప్రవ హిస్తాయి.

9

నీవు వేదాంతాన్ని తెలుసుకోదలచుకుంటే, ఎంత గోలలో నైనా సరే, ఎన్ని కష్టాలల్లో నైనా సరే, తెలుసుకో. ఎందుకంటే, జగత్తులో గోలలేని కష్టాల్లేని పరిస్థితి నీకు దొరకదు.

10

పరిస్థితులు ఎంత విషమంగా ఉంటే, పరిసరాలు ఎంత పరీక్షించే స్వభావం కలవైతే, వాటినిదాటి వచ్చే మానవుడు అంత బలవంతుడన్న మాట. అందుచేత బైటనుంచి వచ్చే బాధలను ఆదుర్దాలను ఆహ్వానించు. ఏలాటి పరిస్థితులలో నైనా, వేదాంతాన్ని జీవించు. అలా చేస్తే పరిస్థితులే నీకు లొంగుతై. నీకు అణిగి ఉంటై. నీవే వాటికి యజమానివవుతావు.

11

నీవు గొప్పవాడివో, తక్కువ వాడివో, ఆ విషయం గురించి గడ్డిపోచమాత్రమైనా ఆలోచించకు. నీమీద నీ వాధార పడివుండు.

12

నీ దివ్యత్వాన్ని గుర్తించుకో. దేనినైనా నిర్భయంగా ఎదుర్కో. వెనుక్కు తగ్గవాకు. ఇతరుల దృష్టితో నీ ఆత్మను చూచుకోకుండా నీలో నువ్వుండు. జగత్తులో నీవే మహాత్మవని నీ ఆత్మే, చెపుతుంది నీకు.

13

ఓ దివ్యుడా! నిన్ను నీవు గౌరవించుకో. అందరూ నిన్ను గౌరవిస్తారు.

14

దైవప్రేమను నీవు అందుకో గలిగితే, నీ తండ్రిలో, తల్లిలో, ప్రతివాళ్ళల్లో, భగవంతుని చూడ గలిగితే, భార్యలో భార్యను కాకుండా, ప్రియుడైన భగవంతుణ్ణి చూడగలిగితే, అప్పుడు నీవే భగవంతుడి వౌతావు. నీవు భగవత్సన్నిధానంలో ఉన్నట్లే.

15

దేహాతీతుడవై, నీ వ్యక్తిత్వాన్ని చంపుకో.

దాన్ని క్షీణించు. దహించు. అప్పుడే నీ కోర్కెలు సఫల మవుతాయి:- అంటే నిన్ను నీవు ధిక్కరించు.

16

జగత్తులో నీవు చూచే ఆకర్షణీయమైంది ధ్యావత్తూ సత్యమైన దివ్యత్వం తప్ప, మరేమీ కాదు. అదే నీ ప్రియురాలి (ప్రియుడు) దేహంలో కనపడేది. ఇంకో వేషంలో, వృక్షాల్లో, పర్వతాల్లో, అదే ఉండేది. దాన్ని తెలుసుకో. లౌకికమైన కామ క్రోధాదులకూ, వాంఛలకూ, అతీతుడవయ్యే మార్గం- దాన్ని తెలుసుకోవడమే. ప్రాపంచిక వాంఛలను వాటికోసం వాటినే ఉపయోగిస్తూ, ఆధ్యాత్మికంగా ఉపయోగించుకొనే పద్ధతి యిదే.

17

నీ దైవత్వాన్ని గుర్తిస్తే అంతా బాగైనట్టే.

18

రాముడు చెప్పేది యిది.

ఇతర్లకోసం కాకుండా, నీకోసం నీవుండు. స్వతంత్రంగా జీవించు.

ఆత్మ, అద్వితీయుడు, పతి, యజమాని; నీ అంత రాత్మ ఐన భగవంతుణ్ణి ఒక్కణ్ణి మాత్రమే సంతోష పెట్టడానికి ప్రయత్నించు. అనేకుల్నీ, అంటే జన బాహుళ్యాన్ని, తృప్తిపరచడం, ఎలాగూ నీచేత కాదు. అదీకాక యింతమందిని తృప్తిపరచవలసిన అగత్యం నీకు ఏమీ, లేదు.

19

(నీది నాది అనే) ఆస్తి హక్కును కాల్చెయ్యి, ఆశాభయాలను గాలిలో వదలివెయ్యి. భేదభావం తీసివేసుకో. శిరస్సుకు ఎంత ప్రాధాన్యమో, పాదా నికీ అంతే.

20

దేహాన్ని నిరంతర పరిశ్రమలోనూ, మనస్సును ప్రేమలో, విశ్రాంతిలో, వుంచడము, ఈ జీవితం లోనే యిక్కడే; పాపమునుండీ, దుఃఖమునుండీ, విముక్తి పొందడం అన్నమాట.

21

సర్వేశ్వరుడితో అద్వైతసిద్ధిని గుర్తిస్తే

(పొందితే) నిశ్చలమైన నిర్లక్ష్యభావంతో కూడిన జీవితం చేకూరుతుంది.

22

హృదయపవిత్రత అంటే, ప్రాపంచిక వస్తు బంధ విముక్తి పొందడం; అంటే కాస్తకూడా తక్కువకాని పరిత్యాగ మన్నమాట. హృదయ పవిత్రత- అంటే అదే!

23

హృదయ పవిత్రత కలవాండ్లే అదృష్టవంతులు. వాండ్లు దేవుణ్ణి చూడగలుగుతారు. ఆ పవిత్రతను నీవు సంపాదించు; నీకు భగవద్దర్శనం లభిస్తుంది.

24

ఆత్మజ్ఞానం, నువ్వు ఈ క్షణంలోనే పొంద వచ్చు. మోహ బంధ విముక్తుడివై ఈర్ష్యాసూయ లను వదలుకో.

25

అసూయ అంటే- ఈర్ష్య అంటే-ఏమిటి? అది మోహబంధంయొక్క యింకొక స్వరూపమే. మనం

ఒకణ్ణి ద్వేషించడానికి కారణం, మరి ఒకదాన్ని మోహిస్తుండడమే.

26

ప్రతివస్తువునుంచీ మోహబంధాలు తెంచి వేసుకో. ఒకే విషయంలో- ఒకే సత్యంలో- అంటే నీ దైవత్వంలో- నిన్ను నీవు కేంద్రీకరించుకో. తత్క్షణం ఆత్మజ్ఞానం పొందుతావు.

27

నీమీద, నీకోరికమీదా, దృష్టిలేకుండా నీపనిని అంటే, విధిని నిర్వర్తించమని రాముడు చెపుతాడు. కర్మే ఆనందం. కర్మ- ఆత్మజ్ఞానానికి ఇంకో పేరు. కాబట్టి కర్మచేసి ఆనందించు.

28

నీవు కర్మను ఆచరించాలి; కాబట్టి ఆచరించు. కర్మాచరణం ఆత్మజ్ఞానానికి దారితీస్తుంది. (అంతే కాని) యేయితర కారణంవల్లగాని కర్మను ఆచరించ వాకు.

29

రాముడు ఇలా చెప్పుతాడు.

"భయపడవొద్దు! నీయావత్తు బలాన్ని శక్తుల్నీ కూడ దీసికో. ధైర్యంగా నీజన్మ హక్కును ప్రతిపాదించు. 'అహం బ్రహ్మోఽస్మి'- భయపడవొద్దు. గడగడ వణకిపోవొద్దు!

30

భయాలవల్ల నీ మనస్సును ఎందుకు కృంగదీసుకుంటావు? విజ్ఞాపనలతో ఎందుకు నీ శక్తుల్ని బైట పెడతావు? నీ అంతఃప్రకృతికి ప్రాతినిధ్యం వహించు. సత్యాన్ని అణగద్రొక్కకుండా ధైర్యంగా బైటికిరా. నేను దేవుణ్ణి- నేనే భగవంతుణ్ణి- అని నిర్భయంగా ఎలుగెత్తి చాటు. అది నీ జన్మహక్కు.

31

అభీష్టమే ప్రేమ. ప్రేమే దేవుడు. ఆ భగవంతుడివే నీవు. ఆ భగవంతుడితో నీ ఐక్యతను గుర్తించు. సర్వాతీతుడవౌతావు.

32

ఏ సమయంలో, ప్రాపంచికబంధాలు, లౌకిక సంబంధాలు, భౌతికేచ్ఛలు, అన్నీ భగవంతుడిలో

సత్యపదార్థంలో కలసిపోతాయో? ఆ సమయమే ఆత్మజ్ఞానానుభవ కాలం.

33

పూర్ణసత్యాన్ని పొందడానికి ప్రాపంచికేచ్ఛలు వదలాలి. లౌకిక స్నేహ మోహాలకు అతీతుడవు కావాలి. నిన్ను బానిసను చేసి బంధించే అన్ని బంధాలకూ స్వస్తిచెప్పాలి. వీటి అన్నిటికి అతీతుడవు కావాలి. ఇది ధర, ఈ విలువ ఇయ్యందే; సత్యాన్ని పొందలేవు.

34

ఒకవైపున ప్రపంచాన్ని అనుభవిస్తూ నీచమైన క్షుద్రమైన ప్రాపంచిక, శారీరక, యింద్రియ వాంఛలకులోనై, అదే సమయంలో దివ్యజ్ఞానానికి నీ హక్కును ప్రతిపాదించలేవు.

35

ప్రతివాడూ క్రీస్తుగావాలని కోర్తాడు. సత్యాన్ని గుర్తించి మతప్రవక్త కావాలని కోరుతాడు. కాని

దానికి తగిన విలువ నివ్వడానికి చాలా కొద్దిమంది మాత్రమే సిద్ధంగా ఉంటారు.

36

ఇదిగో వజ్రాల దుకాణం. ఈగమ్య స్థానమనే, స్వర్గమనే, వజ్రానికి, నీపశు స్వభావ విసర్జన మనే, విలువ చెల్లించాలి. ఆవిలువ చెల్లించ లేకపోతే, వెళ్లిపో.

37

నీవు పూర్ణచైతన్యం పొందలేక పోయినావంటే, దానికి తగ్గ విలువ కట్టలేదన్న మాట. అదే దానికి కారణం. దానివెలకట్టు. తత్క్షణం బ్రహ్మానందం పొందుతావు.

38

నీ దేహం ఎప్పుడూ లేనట్లుగా భావించు.

39

నీదృక్పథం సంపూర్ణంగా మార్చుకో. ప్రతిదీ భగవంతుడుగా, దైవత్వంగా చూడు. జగత్తుతో

నీసంబంధం, భగవంతుడికీ, ప్రపంచానికీ, ఉన్న సంబంధంగా ఉండాలి.

40

నీలో నీవుండు. ఈ మహారాజులు, ఈ దేశాధ్యక్షులు నీసేవకులే నని గుర్తించు.

41

బుద్ధీ, దానితో పాటు యావత్తు స్థూలప్రపంచం గూడా, తెలుసుకోరాని పరమాత్మలో కలసి పోయినప్పుడే, దివ్యమై, వాంఛనీయమైన, జీవన పరమావధి పొంద గలుగుతావు.

42

భేదభావాన్ని జయించి, సర్వైక్యతను పొంది, నక్షత్రాలు, నదులూ, దృష్టి గోచరప్రదేశాలూ, అన్నీ నీవేనని తెలుసుకొని, ప్రేమవల్ల సర్వస్వాధీనంపొంది, అనంతత్వాన్ని గుర్తించినప్పుడే, మోహాకర్షణలకు మనమీద ఉండే అధికారం పోతుంది.

43

భగవంతుణ్ణి నీద్వారా పనిచెయ్యనీ. ఇంక

యేబాధ్యతా వుండదు. భగవంతుని ప్రకాశించనీ. తనను ప్రదర్శించుకోనీ. పరమేశ్వరుణ్ణి జీవించు, భుజించు, తాగు, ఉచ్ఛ్వాసించు, సత్యాన్ని తెలుసుకో. తక్కినవన్నీ వాటంతట అవ్వే కుదటబడతై.

44

జగదైక్యత పొందినవాడితో సహకారం చేయడానికి ప్రపంచం బద్ధమై ఉంది.

45

ప్రపంచాన్ని (భోగాలను) అనుభవిస్తూ ఒకే సమయంలో సత్యాన్ని తెలుసుకోలేవు.

46

ఆత్మజ్ఞానం ఒక్కగంతులో రాదు. దానికి కాలం పడుతుంది. దేహం ఈ పరిణామస్థితిలోకి రావడానికి కోట్ల సంవత్సరాలు పట్టింది.

47

వేదాంతం ప్రకారం, తనయొక్క సర్వస్థితీ, విశ్వప్రేమగా మార్చుకోనిదే, సర్వప్రపంచం తన

దేహంగా చూచుకోండే, యెవడూ, భగవంతుణ్ణి పొందలేడు.

48

ఒక శిశువు బాల్యం దాటందే యౌవనం పొందలేదు. నరనరంలో సర్వజ్ఞాత్త్యైక్యత ప్రీతి స్పందించి నప్పుడు తప్ప, మానవుడు సర్వేశ్వరాను సంధానం పొందలేడు.

49

శారీరిక వ్యామోహాల వల్ల దారితప్పి ఇంద్రియ సుఖా లనే బురదలో నీవు చిక్కుకున్నప్పటికీ, నీ అద్భుతమైన సంకల్పాన్ని తీక్ష్ణంగా స్థిరీకరించి విని యోగించుకోని, భగవచ్చైతన్యం నిలుపుకోనే అవకాశం ఉంది.

50

నీలోపల ఉన్న బలహీనత ఏమిటి? దేహేంద్రియాలే, 'నీ' వనుకొనేటట్లు భ్రాంతివెట్టే, ఆనల్లని అజ్ఞాన శిఖరమే !!! దాన్ని తోసివేసి విముక్తుడివిగా. నీవు శక్తివంతుడవవుతావు.

51

సత్యానికి భయపడవాకు. ఆశ్చర్యపొంద వాకు. నీహృదయాంతరంలో నుంచి అహంబ్రహ్మాస్మి అను.

52

పురాతన వేద కాలంలో నైనా, అహంకారంలో వేళ్లు పాతుకున్న యేకర్మకాండగానీ, ముక్తి ప్రద మని చెప్పబడ లేదు.

53

ముక్తిమార్గం అనగా స్పష్టంగా చావే. వేరొక టిలేదు. పరిత్యాగబాధా మరణమే, దైవజ్ఞానానికి మార్గం ఇంకొకటిలేదు.

54

జ్ఞానంవల్లనే ముక్తి కలుగుతుంది. కానీ స్వార్థం యొక్క బాధ్యతాయుతమై, త్వరపడే నాగరిక బానిస ఐన కర్మకాండ, పాపదుఃఖాలనుండి రక్షించ లేదు.

55

బైబిలు పాతనిబంధనలో కర్మవల్ల ముక్తి, కొత్త

నిబంధనలో విశ్వాసంవల్ల ముక్తీ, ప్రతిపాదించ బడ్డాయని అంటారు. కాని సత్య బ్రహ్మానందస్థితి ఐన స్వర్గం జ్ఞానంవల్లనే సముపార్జింప బడుతుంది.

56

"క్రీస్తుద్వారా భగవంతుణ్ణి పొందుతాము" అనే మాటకు అర్థం విశ్వైక్యాత్మస్థితి లేక క్రైస్తు స్థితిద్వారా నీవు అవ్యయమైన, అనిర్వచనీయమైన, పరమాత్మలోకి దూకుతావని.

57

వేదాంతం ప్రకారం భౌతిక, నక్షత్రలోకాలు కూడా అసత్యాలే; ఈ రెంటికీ నీవు అతీతుడవు కావాలి. ఎందుకంటే, విశ్రాంతి, సత్యప్రశాంతి, ఆనందం, తెరచాటున ఉన్న సత్యం, తెలుసుకోబడి నప్పుడే పొందబడుతుంది.

58

తెరను (మాయ) పలుచ పరచడం అనబడే విశ్వాస సంస్కారం ముఖ్యంగా బుద్ధివల్లనే సాధ్య

పోతుంది. అసలు తెరను పూర్తిగా తొలగించి వేయడం సంపూర్ణానుభవంవల్ల కలుగుతుంది.

59

దేహాభిమానానికి, ధార్మికమైన సన్మార్గానికే చుక్కెదురు. దేహాభిమానం, అధోగతికి దగ్గరదారి.

60

స్త్రీ పురుషులు (Adam and eve) పరస్పర పతనానికి కారకులైతే, మరి బైబిలు వ్రాసిన ఆదేవుడే, పురుష హృదయంలో స్త్రీని అన్వేషించే స్వభావం ఎందుకు పెట్టాడు?

61

సక్రమంగా గృహస్థధర్మం నిర్వర్తించే గృహస్థు అంత సులభంగా, అవివాహితుడు భగవంతుణ్ణి తెలుసుకోలేడు.

62

వివాహం ద్వారా విశ్వప్రేమను, సర్వవ్యాప్తమైన విశ్వజ్యోతిని సమీపించ గలిగితే, వివాహ

బంధాలు మంచివే. అలా కాకపోతే, అవి నీకు విష తుల్యాలు, పాప భరితాలు; నీకు దుఃఖ ప్రదాలు.

63

భార్య తెరచిఉన్న నరక ద్వారం కాకుండా, తన భర్త భగవంతుణ్ణి చూడను అద్దంగా ఉపకరించాలి.

64

*జీవితంలో భార్యా భర్తలు పరస్పరం క్రీస్తులు కావాలి. కాని పరస్పరం జూడస్ ఇస్కారియేట్ లుగా ఉన్నారు.

65

సత్యజ్ఞానంలో నీది, నాది, అనే హక్కులు లేవు. చేసేదీ, చేయబడేదీ, మందుకైనా లేవు.

66

ఆత్మజ్ఞానం అంటే! నీపాత సంగీతాన్ని కొత్త శ్రుతికి మేళవించడం. పాతసంగీతం పాతసంగీతం

---

*జూడస్ క్రీస్తు శిష్యులలో ఒకడు. డబ్బుకు ఆశించి గురువును, శత్రువులకు ఒప్పజెప్పాడు. ద్రోహం చేశాడు. "సంపా"

లాగే ఉంటుంది. అయితే దానికి పూర్తిగా కొత్త స్ఫూర్తి కల్పించాలి.

67

భగవచ్చైతన్యం - దివ్యత్వం - సాధించబడేదీ - సంపాదించబడేదీ - కాదు. ఈవరకే నీలో ఉంది.

68

తన ఆత్మే సర్వం అని గుర్తిస్తే, ప్రత్యేకంగా దేన్నీ కోరడు. అంతా తనదిలాగా ఆనందిస్తాడు.

69

బ్రహ్మైక్యం పొందినవాడు, సర్వవాంఛల్లో సఫలత పొందుతాడు. అతణ్ణి ఎవరూ మోసగించలేరు. ఏబాధా, ఏకష్టమూ, వానికి కలుగదు.

70

దేహం పుట్టనే లేదనుకోని, దివ్యత్వంలో బ్రహ్మత్వంలో వసించే మానవుడు స్వతంత్రుడు; ముక్తుడు.

71

బ్రహ్మజ్ఞానిని, దూషణభూషణాలు, శత్రుమిత్ర

శ్వాలు, పండితుల, తత్త్వవేత్తల, విమర్శలూ, సల హాలూ, చలింపచేయలేవు. అతనిదృష్టిలో అవి నిరర్థకాలు.

72

దివ్యతన్మయత్వంలో మునిగినవాడే ధన్యుడు.

73

విశాల కరుణార్ద్రమైన మాతృహృదయంతో హీనులనూ, పాపులనూ, కౌగలించుకొనేవాడే మహాత్ముడు.

74

దివ్యోన్మత్తతలో బ్రహ్మానంద మధువును తప్ప దాగిన వాడే ధన్యుడు.

75

పాపకృత్యం నుంచి పూర్తిగా తప్పుకోని, వాడు ఇంద్రియ నిగ్రహం, ఆత్మైక ప్రశాంతత, లేకుండా జీవించేవాడు, దివ్యపారవశ్యానందాన్ని, ఆవరించు కోని ఉండలేడు. అంటే తనకు తాను ప్రభువు

కావాలి. ఇంకో విధంగా దివ్య పారవశ్యానందం పొందబడదు.

76

వేదాంత జ్ఞానం కష్టసాధ్యమైంది. ఎందుకంటే యూరప్ అమెరికాల్లోని జన బాహుళ్యం, తమను భగవంతుడిగా మార్చుకోవాలనీ, దివ్యత్వాన్ని సృష్టించాలనీ, అనుకుంటారు.

ఓం ఓం ఓం

# రాముడు

1

దేవుడికి పూర్వమే నేను ఉన్నాను.

2

భూమి పుట్టక ముందే
సముద్రం లేక పూర్వమే
మృదువైన తృణ కేశాలు జన్మించక పూర్వం
కోమలమైన వృక్షశాఖలు పెరక్క పూర్వమే
నాశాఖలకు నవ్యవర్ణ ఫలాలు ఫలించకముందే
నే నున్నాను. నీఆత్మ, నాలో ఉంది.

3

పరి పూర్ణమైన బ్రహ్మానందమూ, అపరిమిత మైన దివ్య తేజమూ, నాలోకూడా ఉంది. నే నెవరికి నమస్కారం చెయ్యాలి? నేనెవరి కోసం నిరీక్షించాలి?

4

ఒక్కటే సత్యం ఉన్నది. ఆ సత్యం నేనే,

ఓం! ఓం!! ఓం!!!

5

సత్యాన్ని నేనే, శరీరప్రాముఖ్యత కోసం నేను హత్య చేసుకోను.

6

ఈ విశ్వమంతా నాభావనే.

7

ఈ జగత్తు నాశరీరం; గాలీ,భూమీ, నాదుస్తులు, పాదరక్షలు.

8

స్వర్గం నాపాత్ర. తళతళ లాడే తేజస్సు నా మధువు.

9

విశ్వం నారూపం కావడం చేత ఆత్మరూపం దాల్చిన మాధుర్యం. నేను దేన్ని నిందిస్తాను? ఆహా! ఆనందం! సర్వం నేనే.

10

ప్రపంచం నాదేహం, అఖిల విశ్వం నాశరీరమే, అని చెప్పగలిగిన వానికి పునర్జన్మం లేదు.

11

ప్ర॥ నీవు 'మతాచార్యత్వం స్వీకరిస్తావా? లేక దేవదూతత్వం వహిస్తావా?

ఉ॥ అక్కర లేదు. అది నా గౌరవానికి లోపం. భగవంతుణ్ణి నేను. నీవు కూడ అంతే. దేహం నా సాధనం.

12

నే నేమీ కోరను. నాకు వాంఛ లేవు. భయం లేదు. దేనికోసం ఆశించను ఏ బాధ్యతా లేదు.

13

నేను మతంలో చేరేవాండ్ల కోసం, అనుచరుల చేర్చటం కోసం, ఆశించను. నేను సత్యాన్ని జీవిస్తాను. అంతే.

14

బుద్ధుడు, మహమ్మదు, క్రీస్తు, మొదలైన మత ప్రవక్తల్లాగా లేక అవతారాల్లాగా వేనకువేలు అనుచరుల్ని సంపాదించడం కాదు. రాముని మతం, ప్రతివ్యక్తిలో, రాముణ్ణి విదితం చేయడమే.

ఈ శరీరాన్ని త్రొక్కండి. ఈ దేహాన్ని తినండి. నమలండి, జీర్ణించుకోండి, నన్ను ఏకం చేసుకోండి, అప్పుడే మీరు రాముడికి న్యాయం చేస్తారు.

15

నీవు ఇంగ్లీషువాడవైనా, అమెరికా దేశస్థుడవైనా, మహమ్మదీయుడవైనా, బౌద్ధుడవైనా, హిందువుడవైనా, ఎవరివైనా సరే, నీవు రాముడి ఆత్మవు. నీవతని అంతరాత్మవు.

16

నాపద్ధతి ప్రచారం కాదు. స్వాచరణమే.

17

నా వేదాంతాన్ని ఒకమాటలో చెప్పమంటే 'ఆత్మవిశ్వాసం, ఆత్మజ్ఞానం' అని చెప్తాను.

18

ఈ విశాలప్రపంచం నాగృహం, మంచి చేయడమే నామతం.

19

నామతానికి ప్రధానమైన మూలసిద్ధాంతాలు గథే కవి వచనాలతో ఇలా చెప్పవచ్చు.

"మానవుడి పరమోత్కృష్టమైన వృత్తి ఏమిటో" నేను చెప్తాను.

నాకు పూర్వం ప్రపంచం లేదు. అది నా సృష్టి.

సముద్రంలోనుంచి సూర్యుణ్ణి ఉద్ధరించిందినేను.

నాతోటే చంద్రుడు తన శుక్ల కృష్ణ పక్షగతులు ప్రారంభించాడు.

20

ఈసర్వ దృశ్యాలకు నేను సాక్షిని మాత్రమే. నేనెప్పుడూ వాటితో ఐక్యం కలుగజేసుకోలేదు. నేనెప్పుడూ వాటికి అతీతుణ్ణే.

ఈ దృశ్యాలన్నీ ఏకక్రమతిలో ఉండే ప్రకంపనాలు. క్రిందికి పైకి తిరిగే చక్రపరిభ్రమణం, అడుగు వెయ్యడం, పైకి తియ్యడం.

21

నిజంగా దేనికీ భయపడనక్కర లేదు. అంతటా

ఎక్కడ చూచినా భవిష్యత్తులో ఒక్కటే పరమ సత్యం ఉంది. అదే నా ఆత్మ.

నేనెవరికి భయపడేది ?

22

జ్వరమువస్తే నేను విచారపడను. మిత్రుళ్లాలాగా దానికి స్వాగతమిస్తా. అప్పుడు అన్యథా తెలుసుకో లేని ఆధ్యాత్మిక సత్యాలు స్ఫురిస్తాయి.

23

ఓ పరమానంద సాగరమా ! ఉత్తుంగ తరంగాలతో, తుఫానులతో, మహోగ్రంగా విజృంభించు. భూమిని స్వర్గాలను సమానంచెయ్యి, సర్వవాంఛల్నీ జాగ్రత్తనీ, ముంచివెయ్యి. నాశనంచెయ్యి. ధ్వంసం చెయ్యి. వీటితో నాకేంపని ?

24

క్షణభంగురమైన, అశాశ్వతమైన, ప్రాపంచిక భాగ్యానికి ప్రాకులాడే వాంఛల్లారా ! పోండి. ఈ శరీరస్థితి ఏ విధంగావున్నా —[illegible] [illegible]దానితో సంబంధంలేదు. అన్నిశరీరాలు [illegible]వే !

౨౫

నీద్వైతత్వమే అయినా, నాద్వైతత్వాన్ని నీహృదయంలో గాఢంగా ప్రతిష్ఠించి, ప్రతిపనిలో, ప్రతి విషయంలో, దాన్ని బహిర్గతం చేయడానికి నిశ్చయించాను.

26

నేను సార్వభౌముణ్ణి స్వామిణ్ణి. మీ హృదయాలు నాసింహాసనం. వేదాల్లో నేను బోధించినప్పుడు, కురుక్షేత్రంలో సంభాషించినప్పుడు, "జెరుసలేం" మక్కాలో ఉద్బోధించినప్పుడు, నన్ను సరిగా అర్థం చేసుకోలేదు. మళ్ళీ నాకంఠం ఎత్తుతా. నాశబ్దమే నీశబ్దం, (తత్త్వమసీ) అది నీవే. నీవు చూచేది సర్వమూ నీవే. దాన్ని ఏశక్తి నిరోధించ లేదు. రాజులు; దయ్యాలు, దేవతలు, కూడా దాన్ని ఎదుర్కోలేరు. సత్యాదేశం అప్రతిహతం. భయపడవాకు. నాశిరస్సు నీదే. కావాలసి వుంటే యీ శిరస్సు నరుకు. వెయ్యి తలలు మళ్ళీ పుడతాయి.

ష్ములు, సిక్కులు, పార్శీకులు, మహమ్మదీయులు అందరూ, నా సోదరులు, కాదు నా ఆత్మ. నేను వాండ్లవాడినే నని చెప్పండి. నేనందరినీ ఆలింగనం చేసుకుంటాను. ఎవరినీ వదలిపెట్టను. నేనే ప్రేమను. ప్రేమ కాంతిలాగా సర్వమూ అలంకరిస్తుంది. సర్వం కాంతి శోభామయం. నిజంగా నేనేదీ కాదు. ప్రేమ తేజోప్రవాహాన్ని. నేనందరినీ సమానంగా ప్రేమిస్తాను.

30

ఓ హిమాలయ హిమఖండాల్లారా; మీ పవిత్రతనూ, సత్య(పరంజ్యోతి)విశ్వాసాన్ని, నిలుపుకోండని మీ ప్రభువు ఆదేశిస్తున్నాడు. మైదానాల్లోకి కల్మషమైన ద్వైతభావజలాలను ఎప్పుడూ పంపవాకు.

31

అన్నిటికంటే తక్కువ నేను. ఎక్కువ నేనే. నాకు ఎక్కువా తక్కువా లేదు. కనపడే ప్రతిస్థలంలో నేనున్నాను. క్రీస్తులో నేను దర్శన మిచ్చా. మహా

మస్త్రిసులో నేను పునర్దర్శనమిచ్చాను. ప్రపంచంలో కల్ల మహాప్రసిద్ధులందరూ నేనే. నీచాతినీచులు, పతితులందరూ నేనే, నేనే సర్వం; సర్వం నేనే.

32

ఆహా! నేనెంత సౌందర్యంగా వున్నాను! మెరుపుతీగెలో మెరుస్తాను; ఉరుముల్లో గర్జిస్తా. ఆకుల్లో మర్మరధ్వనులు చేస్తా. మలయానిలాల్లో ఉసకొడతాను. ఉప్పొంగే సముద్రపు అలలల్లో పొర్లుతా. మిత్రులు నేనే! శత్రులునేనే!

33

ఒక్క అనంతశక్తే, సర్వదేహాల్లో, కనపడే సర్వ వ్యక్తిత్వాల్లో, సర్వస్వరూపాల్లో, ప్రకాశించడం ఎంతవిచిత్రాతి విచిత్రం. పెద్దపెద్దవక్తల దేహాలల్లో, మహాపురుషుల శరీరాలల్లో, నీచజంతువు లల్లో, అనపాయిస్తున్న అనంతాద్వితీయశక్తిని నేనే! నేనే! అహా! ఏమి ఆనందం! నేనా; అనంతసాగమ సాక్ష్యం! ఈ దేహాన్ని కాదు.

34

ఏనజా్రినికీ, సూర్యుడికీ, నక్షతా్రినికి, ప్రకాశం లేదు. ఆ కాంతి నాకు సంబంధించిందే. దివ్యదేహా లన్నీ నానుంచే ప్రకాశించడం. ఆకర్షణీయ ప్రకృతీ, వాంఛితవస్తువుల్లో వుండే మనోహరత్వం నాదే.

35

మొదట నేనే, యీవస్తువులకు ప్రతిభ, మనో హారత్వం దానంచేసి మళ్ళీవాటిని వెతుక్కుంటూ. ప్రాపంచిక భాగ్యాంకోసం, వాకిళ్ళముందర, అడు క్కుంటూ, దైవాకమైన పశువాంఛాగృహాల ముందర భోగాలకోసం. సుఖంకోసం! బిచ్చ మెత్తడం నాగౌరవానికి లోపం, నాపదవికి భంగం ఈ గతికి నేనెప్పుడూ రాను. నానివాకిళ్లలో నేనెప్పుడో అడుక్కోను.

36

ఓ,గారీ! (సముద్రధి) ఎక్కడున్న నీ విజయం?
ఓమృత్యుదేవతా! ఎక్కడుంది నీపాశం?

37

నేను చక్రవర్తులకు చక్రవర్తిని. ఈ ప్రపంచం లోవుండే రాజుల రూపంగా కనపడేది నేనే.

38

నాలోనే సర్వజగత్తూ వసిస్తుంది. చరిస్తుంది. నివసిస్తుంది. ఎక్కడ బట్టినా నా ఆజ్ఞే నిర్వర్తింప బడుతున్నది.

39

దేహాలు అసంఖ్యాకం, ఆత్మ ఒక్కటే,
ఆ పరమాత్మ నేనే ఎవరూ కాదు.
నేనే కర్తను, సాక్షిని, న్యాయాధికారిని,
నేనే విమర్శకుణ్ణి, స్తుతించే వాడిని,
నేనూ అందరూ స్వతంత్రులే,
బంధమూ, హద్దూ, దోషం, నాకు కనబడడం లేదు.

మన అందరికీ స్వేచ్ఛ! స్వేచ్ఛ!
భగవంతుడు, నీవూ, నేనూ, అందరూ, భగవంతుడే!

సంశయం లేదు, బాధ్యత లేదు. భయం లేదు.
నేనా పరమాత్మను, దేశకాలాలు నేనే !

40

నన్ను చంపేఖడ్గం ఎక్కడవుంది? నన్ను సంహరించే ఆయుధం ఎక్కడవ్రుంది? నా సంతోషాన్ని భంగంచేసే కష్టం ఏముంది? నా ఆనందాన్ని ప్రతిఘటించే దుఃఖం ఎక్కడవుంది? అమరమైన, జగత్ప్రభువైన, పరమాత్మను నేను. 'తత్త్వమసీ తత్త్వమసీ !

41

"నా యొడిలోనన నాట్యంబుసలుపు
మృత్యువైనను నాకు మృత్యువు లేదు
ఏనెప్పుడును పుట్టుకే లేదుగాని
ఆ యనంత సముద్ర మండలలట్లు
నా జన్మరాసు లనంతంబు లహహా !"

42

పాపం లేదు, దుఃఖం లేదు, భయం లేదు,
నా ఆనందాత్మలో దివ్యక్షేమం

నా భయాలు పారిపోయినవి. నా సంశయాలు విచ్ఛేదమైనవి.

నా విజయోత్సాహ దినం వస్తుంది.

43

నా ఆత్మ నా రాజ్యం!

పరిపూర్ణానందం నాకక్కడనే ఉంది.

ప్రపంచతరంగం నా మనస్సును ఊప లేదు.

నాకు లాభం లేదు, నష్టం లేదు.

నే నే శత్రువులకు భయపడను. ఏ మిత్రులనూ పరిహసించను. నేను చావుకు భయపడను. అంత్యానికి వణికిపోను.

44

ఓ చోరుడా! ఓ ప్రియమనోహరా!

రా, త్వరగా రా! ఎందుకు భయం?

నాహృదయం నీది. నీహృదయం నాది.

సరే, నీకు కావలసివుంటే, నాసర్వస్వం తీసుకపో.

పరవా లేదు.

నీకిష్టమైతే, ఒక్క దెబ్బతో ఈ శరీరాన్ని
చంపు : చిత్రవధ చెయ్యి.
ఈ శరీరాన్ని తీసుకపో, ఏమైనా చేసుకో
కీర్తి ప్రతిష్ఠలు తీసుకపో.
పోతూ వెనుకకు తిరిగి చూడు.
నేను నిరపాయంగా, సజీవంగా ఉంటాను.
శుభదినం ! ఓప్రియా ! శుభదినం !

## 45

## మార్కండుడు

(రాముడు మృత్యువుకు చేసిన అంత్య సంబోధనం)

"ఓమృత్యుదేవతా ! నీకిష్టమైతే ఈ శరీరం తీసుకపో. నాకేమీ పరవాలేదు. నేను ధరించడానికి అనేక శరీరాలున్నాయి. దివ్యమైన మనోహరచంద్రకిరణాలు ధరించి జీవిస్తా. కొండవాగుల్లో, నదీ ప్రవాహాల్లో, దివ్యగానం చేస్తా. సముద్ర తరంగాల్లో, నృత్యం చేస్తాను. సగర్వంగా వీచే మందమారుతాన్ని నేను. ఝుంఝూమారుతాన్ని నేను.

ఈ నా స్వరూపాలన్నీ మార్పుచెందే సంచార దేహాలు. నేను పర్వతశిఖరాలనుండి దిగివచ్చాను. చచ్చినవాండ్లను బ్రదికించాను. నిద్రించిన వాండ్లను లేపాను. అనేకుల ముఖసౌందర్యాలు బహిర్గతం చేశా. దుఃఖితుల కన్నీళ్ళు తుడిచాను. కృష్ణపక్షినీ, గులాబినీ చూచాను. ఆనందించా. నేను దాన్ని స్పృశించా. దీన్ని స్పృశించా. శెలవు తీసుకున్నా. వెళ్ళిపోతున్నాను. నా యిష్టం వచ్చినట్లు విహరిస్తా. నన్నెవరూ కనుక్కోలేరు. నేనేమీ ఉంచుకోను.”

ఓం. ఓం. ఓం.

# 9

# చినుకల చిందులు



అనువాదం:

కుందుర్తి ఆంజనేయులు బి. ఏ.

# చినుకుల [illegible]ంములు

1

సంఘాలమీాదా, సమాజాలమీాద, ఆధారపడి ఉండవాకు. ఆత్మబలం కలిగి ఉండడం ప్రతిఒక్కడి విధి.

2

ఇతరులను సంతోషపెడదామనే ఉద్దేశంతో ఒకపని చెయ్యవాకు. 'ఇదకాను.' అని చెప్పగలిగిన వాడే ధైర్యశాలి. ఇలా చెప్పగలగడంలో నీకుండే శక్తిని బట్టి, నీ ప్రవర్తనాబలం తెలుస్తుంది.

3

కోర్కె ఒకరోగం వంటిది. అది నిన్ను అనుమానస్థితిలో పెడుతుంది.

4

రాముడు, నీవు గమనించదగ్గ విషయాలు రెండు చెప్తాను - ఒకటి అహంకారాన్ని అణచుకోవడం.

రెండోది సత్యాత్మను స్వీకరించుకోవడం.

5

నీ మనస్సును, నిరంతరమూ, ఉత్సాహంగా, ఉల్లాసంగా, ఉంచుకోవడం - వ్యసనపడకపోవడం, తొందర పడకపోవడం, ఏ భయంవల్లా, ఆదుర్దా వల్లా, కుంగిపోకపోవడం - ఇదే పూర్ణారోగ్యానికి రహస్యం.

6

లోకసమ్మతులనే బురదలో గిలగిల తన్నుకోవడం, లోకాచార సంప్రదాయ ప్రవాహంలో బడి కొట్టుకపోవడం, ఆడంబర కూపంలో మునిగి పోవడం, ధనార్జన అనే మురికి గుంటలో మునిగి కాలం వృధాచేయడం, బంగారం కూడబెట్టి, మంచి చేస్తున్నానని భ్రమించడం, భగవద్ధ్యానంలో ఉపయోగించ దగిన కాలాన్ని, యిలాగ వ్యయం చేయడం, సోమరితనం కాదా?

7

భగవదాత్మతో చూస్తే, ప్రపంచమంతా ఒక

సౌందర్యధారగా, ఆనందస్వరూపంగా, బ్రహ్మా నంద ప్రవాహంగా కనుపిస్తుంది.

8

ఎవరైనాసరే, అంతరాంతరంలో ఒక వస్తువును విశ్వాసయోగ్యమైనదని అంటే, సత్యమైందని అనుకున్నదానిని నమ్మనీ, తప్పనిసరిగా దానిచేత వంచితుడౌతాడు. భూమ్యాకర్షణశక్తి సూత్రానికంటే దృఢమైన సూత్రం ఇది.

9

వార్తా పత్రికలు చదవనివాండ్లు ధన్యులు. ఎందుకంటే ప్రకృతిని, ప్రకృతిద్వారా ఈశ్వరుణ్ణి, దర్శిస్తారు.

10

జనులు నిన్ను గురించి పొగిడితే నీకే చెడు. ఎందుకంటే కపటమతాచార్యులను, వాండ్ల సమకాలీకులు అలాగే పొగిడారు.

11

జీవితం అంటే యీ దేహపంజరంలో బందీ చేయపడ్డ రాబందు రెక్కల చప్పుడు వంటిది.

12

నీ మనస్సు విచార స్థితిలో ఉంటే, నీ సోమరి తనం విడిచిపెట్టు. చేతిలోని పుస్తకం విసిరి అవతల పారెయ్యి. బైట గాల్లో త్వరత్వరగా నడువు. ఇదే రాము డిచ్చే సలహా.

13

హృదయాలు గాఢంగా కలియని స్నేహబంధం, చిటపట పేలిపోయే రసాయనిక సంయోగాలకంటే అధమమై, తెగిపోతుంది.

14

నీ స్నేహితుణ్ణి చెడు ఏదైనా వుంటే, దాన్ని మరిచిపో. అతన్ని గురించి మంచి ఉంటే, దాన్ని చెప్పు.

15

భగవంతుడు వ్యక్తులను గౌరవించడు. అదృష్టం అనేది ఒక భూభాగానికి చెందింది కాదు.

16

జ్ఞానాన్ని సంపాదించి, దాన్ని ఆచరణలో పెట్ట లేక పోవడమే ఆధ్యాత్మిక మాంద్యం. మనో మాంద్యం.

17

భగవన్నేత్రాలతో ప్రపంచాన్ని చూడడమే. నిజమైన విద్య.

18

విమర్శ అనేది - భగవంతుడు మనల్ని చక్క దిద్దడం కోసం ఉపయోగించే పద్ధతి. దానివల్ల మనం ఇతోధికంగా ప్రకాశిస్తాం.

19

అనుమానం, అసూయ, విమర్శ, తప్పులు వెద కడం, అసహ్యించుకోవడంలాంటి భావాలను నీవా శ్రయమిస్తే అవి నీకే తగులుతై. నీతోడిమానవుడి

కంట్లో నలుసులు పరబోవడం, నీ కంట్లో దూలం పెట్టుకోవడమే.

20

నీ మీద విమర్శ వస్తే, నీ లోసలివిషయాలను సింహావలోకనం చేసుకో.

21

వ్రిజలు ఏం తెలుసుకోవాలని కోరుతావు? దాన్ని వాండ్లు మనః పూర్వకంగా గ్రిహించేటట్లు చేయడమే - ఉత్తమమైన విమర్శ.

22

ఒక విషయంలో, స్నేహితుడిలోని స్వల్ప దోషాలు చూచి, అతని మిగతా సద్గుణాలు గౌర వించక పోవడానికి, మనం ఎప్పుడూ సిద్ధంగానే ఉంటాము! ఇది మానవుడి లోపం.

23

ఇతర్లను విమర్శించడంలో మనం వ్యయంచేసే శక్తి, మనం ఆదర్శవంతంగా జీవించడానికి సరిగ్గా సరిపోతుంది.

24

నీ హేతువాదం పూర్వుల భ్రిమలకు విపరీత చేష్టలకు, ఉపదేశాలకు బానిస ఐ, వాటిని సమర్థించ లేకపోతే, నీవే దురదృష్టవంతుడివిగా పరిగణించబడతావు. అందరూ నీకే యెదురు తిరుగుతారు.

25

మనం జగత్సంస్కర్తలమని బైలుదేరిన తత్ఫలితమే, దాన్ని యింకా అందవికారంగా చేస్తున్నాం.

26

ఇతర్ల దృష్టితో మనం మనలను చూచుకోవడమే, అహంకారం.

27

ఆజ్ఞలు, సూత్రాలు - వీటి ఆధిక్యంవల్ల ప్రజలు నిజమైన ఆత్మను పోగొట్టుకొని (మరచిపోయి) వట్టి పేర్లమనీ, స్వరూపాలమనీ, భ్రిమిస్తారు.

28

నీ ఆత్మకేంద్రాన్ని వదలి వెలుపల తిరుగవాకు; నీలో నీవు వుండు.

29

నీవు ఆత్మకు దూరం కావాకు, పడిపోతావు. అది నీ పతనానికి దారి తీస్తుంది. నీలో నీవు గట్టి విశ్వాసం ఉంచుకో. అప్పుడు నిన్ను ఏదీ కదల్చ లేదు.

30

సత్యం పతనమైనా మళ్ళీ విజృంభిస్తుంది. భగ వంతుడి అనంతత్వం దానిదే.

31

క్రీస్తు పదకొండుమంది శిష్యులకు మాత్రం బోధించాడు. కాని ఆబోధలను వాయు రాకాశాలు కూడ బెట్టుకొన్నై. ఈనాడు కోటానుకోట్లు వాటిని చదువుతున్నారు.

32

దురూహాలూ, లౌకికేచ్ఛలూ అనిత్యమైన మనో దేహాలకు సంబంధించినవి. అజ్ఞానజనితాలు.

33

అజ్ఞానాన్ని కప్పిపుచ్చుకోడానికి లౌకికజ్ఞానం ఒక పైపూత.

34

శిశువు తన తండ్రికి తండ్రి.

35

నీ అనుభవానికి మించిన గురువు లేడు.

36

'నేను కవిత్వం వ్రాస్తున్నాను' అనే అహంకారాన్ని చంపుకొని దాని కతీతుడ నైనప్పుడే, కవి దివ్యమైన ఆవేశాన్ని పొందుతాడు.

37

భగవంతుడిలో జీవించు. అంతా సరిగా ఉంటుంది. ఇతర్లనుకూడా అలాగే చెయ్యి. సత్యం చక్కబడుతుంది. ఈ సత్యాన్ని నమ్మితే నీవు రక్షింపబడతావు. అతిక్రమిస్తే బాధపడతావు.

38

చావుబ్రతుకులు నిశ్వాస ఉచ్ఛ్వాసముల వంటివి.

39

చరిత్రకారుల దృష్ట్యా కాకపోయినా హాక్లీస్ వస్తుతః దివ్యుడు కాబట్టే నిజమైన శాస్త్రకారుడు.

40

ప్రపంచంలో నీవు ఎదుర్కొనే ప్రతివిషయం, అవరోధంగా కాకుండా, సోపానంగా ఉండాలి. అన్ని అవరోధాలనూ నీసోపానాలుగా మార్చుకో.

41

పరిత్యాగ బాధితుడికి (క్రీస్తుకులాగా) ప్రపంచం 'యీడేన్ స్వర్గవనం అవుతుంది. ఇతర్లకు 'పోయిన స్వర్గం' (Paradise Lost) అవుతుంది.

42

ధాన్యం హెచ్చు తగ్గులను గురించి మాట్లాడి నంత తేలిగ్గా మనుష్యుణ్ణిగురించి మాట్లాడుతారు.

దానికి అతీతుడివిగా ఏదీ నీకు విలువ కట్టలేదు. నీవు అమూల్యుడవు.

43

హృదయం దైవోద్దేశిక మహాసభామంటపం లోకి పోయేద్వారం 'మనసు' బైటికి వచ్చే దారి.

44

భ్రాంతిని ఛేదించు ! విచ్ఛేదించు!
మేలుకో! మేలుకో! స్వతంత్రుడవికా !
స్వాతంత్ర్యం ! స్వాతంత్ర్యం !! స్వాతంత్ర్యం !!!

ఓం!

# 45

## కా వ లె ను

సంస్కర్తలు
ఇతర్లను సంస్కరించను కాదు -
తమ్ము తాము సంస్కరించుకోను.
యూనివర్సిటీ డిగ్రీలు సంపాదించిన వాండ్లు కాదు-
తమ ఆత్మ విజయం పొందినవాండ్లు.
వయస్సు : దివ్యానంద యావనం.
జీతం : బ్రహ్మాత్వం.
త్వరలో దరఖాస్తులు పంపుకోండి!
యాచనలు ప్రార్థనల్తో కాదు—
ఆజ్ఞారూపకమైన నిశ్చయమైన సంకల్పముతో
(ఎవరికి?) విశ్వనాథుడికి -
మీ ఆత్మకు.

ఓం! ఓం!! ఓం!!!

## 46

ఒకజ్ఞాని, వేదాంతి, కవి, శాస్త్రకారుడు, శాస్త్రీకుడు వీండలో యెవరైనావక్రే - తనకూ, పకాగ్రితకూ శుృతికలుపుకొని, తన వ్యక్తిత్వచిహ్నమే మాత్రమూ లేనంత పరిత్యాగోన్నతిని అందుకో గలిగి ఎప్పుడు ఆచరణరూపకంగా వేదాంత జ్ఞానాన్ని పొందుతాడో, అప్పుడే గాయకశ్రేష్ఠుడైన భగవంతుడు. ఆతని మనోదేహాలన్నే, సంగీత వాద్యాలతో మనోహరశాంత రాగాలాపనచేస్తాడు.

## 47

అమృతశాంతి వానచినుకులుగా పడుతున్నది.
అమృతం సంగీతవర్షంగా కురుస్తున్నది.
చినుకులు ! వానజల్లు !! చినుకుల చిందులు ! ! !

నాకీర్తిమేఘాలు ఆనందంతో విహరిస్తున్నై.
ప్రపంచాలు వాటినుండి, ముత్యాల్లా రాలుతున్నై.
చినుకులు! చినుకులు!! చినుకుల చిందులు!!!

పరిమళవంతమైన నాశ్వాస ధర్మవాయువు;

మనోహరంగా వీస్తున్నది.

కొన్నివస్తువులు చిన్నచిన్న కొమ్మల్లా ఉయ్యాల లూగుతున్నై.

మరికొన్ని పడుతున్నై-మంచి బిందువుల్లా.

చినుకుల చిందులు! చినుకుల చిందులు!! చినుకు చిందులు!!

గంభీరకాంతి ఒక తెల్లని సముద్రం.

పాలసముద్రం.

అలలతో మృదువుగా కులుకుతూవుంది.

వానజల్లుల ప్రపంచాన్ని సృష్టిస్తూవుంది.

నేను నక్షత్రాల వర్షబిందువులు కురుస్తున్నా

చినుకుల చిందులు! చినుకుల చిందులు!! చినుకుల చిందులు !!!

48

నీవు భయపడ్డావా ? దేనికి ?

భగవంతుడికా ? బుద్ధిహీనత ?

మానవుడికా ? పిరికితనం ?

ఇంద్రియాలకా ? ధైర్యంగా ఎదుర్కో;

లేక నిన్నే నీవు చూచా ? నిన్ను నీవు తెలుసుకో;

'అహం బ్రహ్మాఽస్మి, నేనే దేవుణ్ణి' అని ఉద్ఘోషించు.

ఓం ఓం ఓం